బ్రహ్మర్షి పత్రీజీ ఆశీస్సులతో..

# సంకల్పమంటే?


తటవర్తి వీరరాఘవరావు





అనుబంధం :

బ్రహ్మర్షి పత్రిగారి **సంకల్పశక్తి**

బ్రహ్మర్షి పత్రీజీ ఆశీస్సులతో...

# సంకల్పమంటే?



| | | |
|---|---|---|
| రచన & ప్రచురణ | : | తటవర్తి వీరరాఘవరావు |
| 2021 సం॥రం | : | మూడు ముద్రణలు |
| కాపీలు | : | 6,000 |
| వెల | : | రూ. 50/- |


పుస్తకముల కొరకు

**తటవర్తి వీర రాఘవరావు**

**తటవర్తివారి వీధి, భీమవరం - 534 201. ప॥గో॥జిల్లా.**

**ఫోన్ : 9490171853, సెల్ : 9440309812**

email : balajipyramid.bvrm@gmail.com

# విషయ సూచిక





## ధ్యానం చేసే పద్ధతి
## శ్వాసమీద ధ్యాస



ఎవరికి తగిన సుఖాసనంలో వారు హాయిగా కూర్చుని... చేతులు రెండూ కలిపి... కళ్ళు రెండూ మూసుకుని... ప్రకృతి సహజంగా జరుగుతున్న ఉచ్ఛ్వాస, నిశ్వాసలను గమనిస్తూ వుండాలి!

మధ్యమధ్యలో అనేకానేక ఆలోచనలు వస్తున్నా వాటిని ఎప్పటికప్పుడు 'కట్' చేస్తూ... మళ్ళీ, మళ్ళీ శ్వాస మీదకే... ధ్యాస మరల్చుతూ వుంటే.. క్రమ క్రమంగా... ఆలోచనా రహిత స్థితి కలుగుతుంది.... చిత్తవృత్తులు నిరోధించబడతాయి... మనస్సు నిర్విషయం, శూన్యం అయిపోతుంది. మనస్సు శాంతిస్తుంది. ఇదే ధ్యాన స్థితి.

ఈ ఆలోచనా రహిత స్థితిలో కలిగే అనేకానేక శారీరక, నాడీ మండల, ఆత్మానుభవాలను గమనిస్తూ వుండాలి. ఆ స్థితిలో విశ్వమయ ప్రాణశక్తి. అపారంగా శరీరంలోకి ప్రవేశించి నాడీ మండలాన్ని శుద్ధి చేస్తుంది. ఆ శక్తి వల్ల రోగాలన్నీ తగ్గుతాయి. నాడీమండల శుద్ధి వల్ల కర్మలు పోతాయి.

ప్రతిరోజూ ఎవరి వయస్సు ఎంతుంటుందో... కనీసం అన్ని నిమిషాలు... తప్పనిసరిగా... రోజుకి రెండు సార్లుగా... ధ్యానం చెయ్యాలి.

# ధ్యానం ద్వారా శక్తి

ధ్యానం ఎందుకు? అని చాలా మంది అనుకుంటారు. కానీ ధ్యానం చేస్తే ఎవరికైనా శక్తి లభిస్తుంది. అంటే వారిలో శక్తి పెరుగుతుంది. శక్తి పెరిగే కొద్దీ ఎవరైనా ఏదైనా సాధించవచ్చు.

అందుకే మునులు, ఋషులు, రాక్షసులు పూర్వకాలంలో ధ్యానం చేసేవారు. అపారమైన శక్తి సంపాదించుకునే వారు, అతీంద్రియ శక్తులు కూడా సంపాదించుకునే వారు. సామాన్యులకు అసాధ్యమైన వాటిని కూడా సాధించుకునేవారు.

ప్రస్తుతం మనం చేస్తూన్న ధ్యానాన్నే పూర్వ కాలంలో తపస్సు అనేవారు. కారణం వారంతా ఏదో ఒక తపనతో ఈ ధ్యానాన్ని విశేషంగా చేసేవారు. అలా "తపనతో, తపిస్తూ చేసే ధ్యానాన్నే తపస్సు" అంటారు. "తపించడమే తపస్సు". ఒక రకంగా 'తపస్సు' చేయడమంటే 'ధ్యానం' చెయ్యడమే. ఒక రకంగా పూర్వం ఋషులు చేసే 'తపస్సు' ప్రస్తుతం మనం చేసే 'ధ్యానం' రెండూ ఒక్కటే!

ధ్యానం చెయ్యడం అంటే ధ్యాస వుంచడం. ఎవరి మీద? తాను కోరుకున్న వారి మీద, తాను ఇష్టపడే వారి మీద. ప్రస్తుతం మనం ధ్యానం ద్వారా ఎవరి మీద ధ్యాస వుంచుతున్నాం? 'ఆత్మ' మీద, 'ఆత్మ' అంటే ఎవరు? సాక్షాత్తూ భగవంతుడు. ఈ సృష్టిని సృష్టి చేసిన వాడు. సృష్టికి కారకుడు, సృష్టిని నడిపిస్తున్నవాడు. సృష్టికి ఆధారమైనవాడు. అలాంటి భగవంతుని మీద ధ్యాస వుంచడమే, దృష్టి వుంచడమే మనం చేసే 'శ్వాస మీద ధ్యాస' ధ్యానం.

అలా తపస్సు చేసే కొద్దీ అంటే ధ్యానం చేసే కొద్దీ ఎవరైనా సరే ఆత్మకు అంటే భగవంతునికి దగ్గర అవుతారు. అలా భగవంతునికి దగ్గర అయ్యే కొద్దీ ఎవరికైనా 'శక్తి' పెరుగుతుంది. 'శక్తి' అన్నది కంటికి కనిపించేది కాదు. 'శక్తి' అన్నది శరీరానికి పుష్టినివ్వదు. శరీరానికి పుష్టినిస్తే 'బలం' అంటారు. అందుకే దేవతలను, దేవుళ్ళను, యోగులను, ఋషులను శక్తివంతులు అంటారు కానీ, బలవంతులు అనరు.

రామకృష్ణ పరమహంస శక్తివంతుడు, రమణ మహర్షి శక్తివంతుడు, షిరిడీ బాబా శక్తివంతుడు, వీరబ్రహ్మేంద్రస్వామి శక్తివంతుడు, వీరు బలవంతులు కాదు. వీరికి కండలు లేవు. వీరికి శక్తి ధ్యానం చెయ్యడం వల్లనే వచ్చింది. ధ్యానం ఎంత

ఎక్కువ చేస్తే శక్తి అంత ఎక్కువ వస్తుంది.

శక్తి వున్నవాడు ఏద్దైనా చేయగలడు, దేన్నైనా సాధించగలడు. శక్తి హీనుడు ఏదీ చేయలేడు, దేన్నీ సాధించలేడు. శక్తి హీనుడు అన్నిటికీ భయపడతాడు, అన్నిటికీ సంశయిస్తాడు. శక్తి వున్నవాడు నిర్భయంగా వుంటాడు, దేనికీ సంకోచించడు.

శక్తిహీనుడు అర్థిస్తాడు, ప్రార్థిస్తాడు, వేడుకుంటాడు, కాపాడు, రక్షించు అంటాడు, ఆర్తనాదాలు చేస్తాడు, దీనంగా హీనంగా ప్రవర్తిస్తాడు. కానీ శక్తివంతుడు అర్థించడు – ఆశీర్వదిస్తాడు, ప్రార్థించడు – పాటిస్తాడు. రక్షించు అనడు – అందరినీ రక్షిస్తాడు. కాపాడు అనడు – అందరినీ కాపాడుతాడు. ఆర్తనాదాలు చెయ్యడు – ఆధిక్యతను ప్రదర్శిస్తాడు. భీరువులా ప్రవర్తించడు – ధీరుడిలా ప్రవర్తిస్తాడు. హీనంగా ప్రవర్తించడు – హీరోలా ప్రవర్తిస్తాడు. ఇదంతా శక్తి ఉండబట్టే.

ధ్యానం చేసి శక్తి సంపాదించుకునేవారు శక్తి పెరిగే కొద్దీ అన్నీ చేయగలుగుతారు, శక్తికి తగ్గట్టు ప్రవర్తిస్తారు. శక్తి పెరిగే కొద్దీ వ్రాయలేని వారు వ్రాస్తారు, నలుగురిలో మాట్లాడలేనివారు మాట్లాడగలుగుతారు, చేయలేని పనులు చేస్తూ వుంటారు. శక్తి పెరిగే కొద్దీ చేసే పనులలో నైపుణ్యం పెరగడమే కాదు ప్రదర్శిస్తారు కూడా.

శక్తి హీనులు దుఃఖాన్ని, కష్టాల్ని, సమస్యల్ని తట్టుకోలేరు. శక్తి వున్న వారు ఎన్ని కష్టాలు వచ్చినా చలించరు, ఎంత దుఃఖం వున్నా ఏమీ లేనివారిలా ప్రవర్తిస్తారు.

శక్తి లేనివారు ప్రతీదానికి ప్రతిస్పందిస్తారు. కానీ శక్తి వున్నవారు శీతోష్ణాలలో కానీ, సుఖదుఃఖాలలో కానీ, మానావమానాలలో కానీ, గెలుపు ఓటములలో కానీ సమస్థితి ప్రదర్శిస్తారు. అమ్మోయ్, బాబోయ్ అని అనరు.

శక్తి లేనివారికి త్రికరణ శుద్ధి వుండదు. శక్తి వున్నవారికి త్రికరణ శుద్ధి వుంటుంది.

శక్తి లేని వారు తమకున్నవన్నీ, తమకు జరిగేవన్నీ శాశ్వతమనుకుంటారు. విపరీతమైన మమకారం ప్రదర్శిస్తూ వుంటారు. కానీ శక్తివంతులు ఏదీ శాశ్వతం కాదని తెలుసుకుంటారు, అన్నీ మారేవే! మార్పు చెందేవే! మార్పు అన్నది సహజమని తెలుసుకుంటారు.

శక్తి లేని వారు అజ్ఞానంలో వుంటారు. శక్తి పెరిగే కొద్దీ జ్ఞానవంతులవుతూ

వుంటాడు. శక్తి వున్నవారు మానాన్ని, అవమానాన్ని మధురంగా తీసుకుంటారు. శక్తి లేనివారు సన్మానానికి పొంగిపోతారు. అవమానానికి కుంగిపోతారు.

శక్తి లేని వారు ఏదైనా పోతే దుఃఖపడతారు, వస్తే సంబరపడతారు. కానీ శక్తి వున్నవారు వచ్చినా, పోయినా ఒకేలా జీవిస్తారు. శక్తి లేని వారు దుఃఖిస్తారు, అశాంతిగా జీవిస్తారు. కానీ శక్తి వున్నవారు ఆనందంగా, శాంతిగా జీవిస్తారు.

శక్తి లేనివారికి ప్రజ్ఞ వుండదు కానీ శక్తి వున్నవారికి ప్రజ్ఞ వుంటుంది.

శక్తి పెరిగే కొద్దీ ఊర్ధ్వలోక ప్రాప్తి కలుగుతుంది.

మనం ఆరాధించే దేవుళ్ళంతా శక్తివంతులే. అంతా ధ్యానం చేసిన వారే! అలా ఎవరైనా సరే ధ్యానం చేసే కొద్దీ శక్తివంతులై, వివేకానందులులా, రమణ మహర్షులులా, సత్యసాయిబాబాలా, బుద్ధుళ్ళులా, జీసస్‌లా శక్తివంతులవుతారు.

అందుచేత శక్తి పెంచుకోండి. ఆనందంగా జీవించండి. మీలో శక్తి వుందా? శక్తి పెరిగిందా? అని తెలియాలంటే మీరు జీవించే విధానాన్ని పరిశీలించుకుంటే మీకే తెలుస్తుంది. అలాగే ధ్యానం చేసే కొద్దీ మీలో శక్తి పెరుగుతూ వుంటుంది. మీలో వచ్చే మార్పులు మీకు మీరే గమనించగలుగుతారు. ఎంత ధ్యాన సాధన చేస్తే అంత శక్తివంతులుగా అవుతారు. ఎక్కువ చేస్తే ఎక్కువ శక్తి, తక్కువ చేస్తే తక్కువ శక్తి. అందుకే "చేసుకున్న వారికి చేసుకున్నంత మహదేవా" అన్నారు.

అలా మీ జీవితంలో ఎన్నాళ్ళు ధ్యానం చేస్తే అన్నాళ్ళు మీ శక్తి పెరుగుతూనే వుంటుంది. అందుచేత వీలైనంత ఎక్కువ ధ్యానం చెయ్యండి.



# ధ్యానం చేస్తే శక్తి ఎలా పెరుగుతుంది?

ధ్యానం చేసేటపుడు ముందుగా మనం చేతులు కట్టేస్తాం, కాళ్ళు కట్టేస్తాం, కళ్ళు మూసుకుంటాం. అపుడు మనకు సహజంగానే ఆలోచనలు వస్తాయి. అంటే మనసు రకరకాల ఆలోచనల మీదకు పోతుంది. వెంటనే మనం మనస్సును శ్వాస మీదకు మళ్ళిస్తాం. కాసేపటికి మనస్సు మళ్ళీ ఆలోచనల్లోనికి వెళ్తుంది. మరల మనస్సును శ్వాస మీద వుంచుతాం. ఇలా చెయ్యగా... చెయ్యగా... ఆలోచనలు నెమ్మదిగా తగ్గుతూ.. తగ్గుతూ... ఒక స్థితిలో... ఒక స్థాయిలో... ఆలోచనలన్నీ ఆగిపోతాయి. మనస్సు నిర్విషయమైపోతుంది. అంటే మనస్సులో ఏ విషయాలు వుండవు అంటే ఏ ఆలోచనలు వుండవు అంటే మనస్సు శూన్యమైపోతుంది.

ఈ స్థితిలో అక్కడ వుండేది అనంతశక్తివంతమైన 'ఆత్మ' ఒక్కటే. అలా ఎవరైతే అలాంటి స్థితిలో ఎంతసేపు వుంటారో... వారు అంతసేపు ఆత్మస్థితిలో వున్నట్టు. అలాంటి వారికి సహజంగానే అంతర్గతంగా వున్న అనంతమైన ఆత్మశక్తి కొంత లభిస్తుంది. దానితో పాటు విశ్వంలో వున్న విశ్వశక్తి కూడా కొంత లభిస్తుంది. ఈ శక్తుల వల్ల వారు శక్తివంతులవుతారు. అలా ఎంతసేపు ధ్యాన స్థితిలో వుంటే అంటే ఆలోచనా రహిత స్థితిలో వుంటే అంతసేపూ వారు శక్తిని పొంది శక్తివంతు లవుతూ వుంటారు.

అలా శక్తి పెరిగే కొద్దీ వారు జీవితంలో ఎన్నో లాభాలు పొందుతారు. వాటిలో కొన్ని మనం పైన తెలుసుకున్నాం. అందుకే యోగులు ఎంతో మంది ఆ రకమైన ధ్యాన స్థితిలో గంటలు, రోజులు, నెలలు, సంవత్సరాలు వుండి అపారమైన శక్తి సంపాదించుకున్నారు, దివ్యశక్తులు సంపాదించుకున్నారు, దివ్యత్వాన్ని పొందారు. అలాంటి వారిని ఎంతోమందిని మనం ప్రస్తుత కాలంలోనే చూస్తున్నాం, గతంలో కూడా వారు వున్నారు. రమణ మహర్షి, రామకృష్ణ పరమహంస, వివేకానంద, శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి, యోగివేమన, రాఘవేంద్రస్వామి, సత్యసాయిబాబా, షిరిడీ సాయిబాబా, పాకలపాటి గురువుగారు, ముమ్మిడివరం బాలయోగి, సుభాష్‌పత్రీజీ లాంటి వారెందరో వున్నారు. మనకు తెలిసిన వారు కొందరైతే తెలియని వారు కూడా ఎందరో వున్నారు. అంతా ధ్యానం చేసినవారే. వారందరూ చేసింది ధ్యానమే. చెప్పింది ధ్యానమే.

వారందరినీ మనం శక్తివంతులు అని అంటాం కానీ బలవంతులు అని అనం. కారణం వారికి శారీరకమైన బలం వుండదు. అంటే కండలు లేవు. కారణం వారు తిండికి ప్రాముఖ్యం ఇవ్వలేదు. మాంసం, గుడ్లు, చేపలు, కోళ్ళు, మేకలు,

## మమ్మల్ని తినకండి! ప్రేమించండి!!



## భగవంతునికి అన్ని ప్రాణులు విలువైనవే

పందులు తినలేదు. శరీరాన్ని పెంచలేదు, శక్తిని పెంచుకున్నారు. తద్వారా జ్ఞానాన్ని సంపాదించుకున్నారు – జ్ఞానవంతులయ్యారు. మేధస్సును పెంచుకున్నారు – మేధావంతులయ్యారు. ధర్మాన్ని తెలుసుకున్నారు – ధర్మమూర్తులయ్యారు. ప్రేమను పెంచుకున్నారు – ప్రేమమూర్తులయ్యారు. కరుణను పెంచుకున్నారు – కరుణా స్వరూపులయ్యారు. దయను పెంచుకున్నారు – దయామయులయ్యారు. దివ్యశక్తులు సంపాదించుకున్నారు – దివ్యులయ్యారు. అంటే దేవుళ్ళయ్యారు. మానవులనే కాదు సమస్త జీవులను కోడి, మేక, చేపలతో సహా అన్ని ప్రాణులను ప్రేమించారు, రక్షించారు, కరుణ, దయ చూపించారు. అన్నిటితో స్నేహం చేశారు. అన్నీ ఒకటే, అంతా సమానమే అని చాటి చెప్పారు. "అంతా నేనే – నేనే అంతా" అన్న సత్యాన్ని తెలుసుకోగలిగారు.

అందుచేత బలం కంటే శక్తి గొప్పదని తెలుసుకోండి. బలవంతులు కాదు శక్తివంతులు కండి, కారణం బలవంతులకు దుఃఖం పోదు – శక్తివంతులకు దుః

## బలం కంటే శక్తి గొప్పది





## ధ్యానం ద్వారానే శక్తి – ధ్యానం అంటే శ్వాస మీద ధ్యాస

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ మూవ్‌మెంట్ – ఇండియా

ఖం పోతుంది. బలవంతులకు సంకల్ప శక్తి వుండదు, కోరికలు వుంటాయి – శక్తి వంతులకు అపారమైన సంకల్ప శక్తి వుంటుంది, కోరికలు అదుపులో వుంటాయి. అంతేకాదు గమనిస్తే సామాన్యులు బలవంతుల కాళ్ళ మీద పడరు, శక్తివంతుల కాళ్ళ మీదే పడతారు. అందుచేత బలవంతులు కావడం ప్రధానంకాదు. శక్తి సంపాదించుకుని శక్తివంతులుగా, యోగులుగా అవ్వడమే ప్రధానం.

అంతేకాదు ధ్యానం ద్వారా అంటే మనస్సు శూన్యం చేసుకోవడం ద్వారా మాత్రమే శక్తి సంపాదించుకోగలమని, ఆత్మ స్థితి పొందగలమని, జ్ఞానవంతులం కాగలమని భగవద్గీత ద్వారా శ్రీ కృష్ణ భగవానుడు కూడా ఎప్పుడో చెప్పారు.

**శ్లో॥ ధూమే నావ్రియతే వహ్ని ర్యథాదర్శో మలేన చ ।**
**యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్ ॥ (భ.గీ.3-38)**

తా :- పొగచేత అగ్ని, మురికి చేత అద్దము, మావి చేత గర్భమందలి శిశువు కప్పబడినట్లు కామము చేత ఆత్మజ్ఞానం కప్పబడి వున్నది.

పై సందేశాన్ని బట్టి కామము అంటే కోరిక. అంటే మనస్సు ఆత్మజ్ఞానాన్ని అంటే ఆత్మను కప్పి వుంచింది అని అర్థం. అంటే అనంతశక్తి కలిగిన ఆత్మను మలినమైన మనస్సు కప్పి వుంచడం వల్ల, ఆవరించి వుండటం వల్ల మానవుడు శక్తి హీనుడుగా, అజ్ఞానిగా ప్రవర్తిస్తున్నాడని దీని అర్థం.

ఏ రకంగానైతే పొగచేత అగ్ని, మురికి చేత అద్దము, మావి చేత శిశువు కప్పబడి వున్నాయో అలాగునే మనస్సు చేత ఆత్మకప్పబడి వుంది.

అందుచేత పొగ తొలగిపోతే అగ్ని ఎలా ప్రకాశిస్తుందో, మురికి పోతే అద్దం ఎలా స్పష్టంగా కనిపిస్తుందో, మావి తొలగిస్తే శిశువు ఎలా బయటపడుతుందో ఆ రకంగానే మనస్సు లేకపోతే అంటే శూన్యమవుతే అంటే ఆలోచనలు ఆగిపోతే మానవులో ఆత్మశక్తి బహిర్గతమవుతుందని, అంటే వ్యక్తమవుతుందని ఆత్మ జ్ఞానం పెరుగుతుందని శ్రీ కృష్ణుల వారు పై శ్లోకం ద్వారా తెలిపి వున్నారు.

అందుచేత ఎవరైతే ధ్యానం చేస్తారో, మనస్సును శూన్యం చేసుకుంటారో, వారిలో అపారమైన శక్తి పెరుగుతుందని తెలుసుకోవాలి. శక్తి పెంచుకున్నవారు భూమి మీద సాధించలేనిదంటూ వుండదు. ఏదైనా సునాయాసంగా సాధిస్తారు.

అందుచేత తెలుసుకోండి శక్తివంతులు ఎవరిని ప్రార్థించరు. ఎవరిని కోరరు. అంటే దైవాన్ని కాని, ప్రకృతిని కాని, విశ్వాన్ని కానీ కోరుకున్నది అవ్వాలని, కావాలని, అనుకున్నది జరగాలని కోరరు. అంటే సంకల్పాలు పెట్టుకోరు. అనుకున్న దానిని సాధించడం కోసం కృషి చేస్తారు. అందుచేత ఎవరైనా సరే శక్తి పెంచుకుని శక్తివంతులు కావడానికి కృషి చెయ్యాలి. అంతేకానీ శక్తి హీనులుగా ప్రవర్తించకండి. శక్తిని కోల్పోయే పనులు చెయ్యకండి.

# సంపాదించిన శక్తి అలాగే వుంటుందా?

ధ్యానం చేస్తే శక్తి పెరుగుతుందని తెలుసుకుని ప్రస్తుతం చాలా మంది ధ్యానం చేస్తున్నారు. అలా ధ్యానం చేస్తూ చాలా మంది శక్తిని పెంచుకుంటున్నారు. కొంతమంది చాలా ఎక్కువగా ధ్యానం చేస్తున్నారు. అవకాశం ఉన్నప్పుడే కాదు. అవకాశం కల్పించుకుని మరీ ధ్యానం చేస్తున్నారు. అలా పౌర్ణమి రాత్రులు, అమావాస్య రాత్రులు ధ్యానం చేస్తున్నారు. 40 రోజుల దీక్షలు, అఖండ ధ్యానాలు కూడా చేస్తున్నారు.

అలా చేస్తూ చాలా మంది తమకు చాలా శక్తి పెరిగిందని భావిస్తున్నారు. కొంతమంది ధ్యానం చేస్తూంటేనే తమలోకి అపారంగా శక్తి ప్రవేశిస్తున్నట్టు అనిపిస్తుందంటారు. ఇంకా కొంతమంది ఆ శక్తిని తట్టుకోలేకపోతున్నాం, ధ్యానంలో కూర్చోలేకపోతున్నామని కూడా అంటారు. అలా ఎక్కువగా ధ్యానం చెయ్యడం వల్ల ఎంతో శక్తి సంపాదించుకున్నామనుకుంటారు.

కానీ ఇక్కడ గమనిస్తే చాలా మందిలో ఎన్నాళ్ళు ధ్యానం చేసినా! ఎంత ఎక్కువ ధ్యానం చేసినా! ఎంత శక్తి సంపాదించినా! వారిలో ఎటువంటి మార్పు వుండదు. వారి ప్రవర్తనలో ఏ మార్పు కనిపించదు. ఏదో కొద్దిపాటి తేడా తప్ప. కొంతమంది ధ్యానం చేసేవారిని చూసి విమర్శించే వారు కూడా వున్నారు. ఎన్నాళ్ళ నుంచో ధ్యానం చేస్తున్నావు? నీలో ఏం మార్పు వచ్చింది? నువ్వు ఏం మారావు? అని అంటూ వుంటారు. అలాగే ఎప్పటి నుంచో ధ్యానం చేసే మాష్టర్సు యొక్క ప్రవర్తన కూడా సరిగా వుండదు. చూసే వాళ్ళు అనుకుంటూ వుంటారు. వీరు ఇన్నాళ్ళ నుంచి ధ్యానం చేస్తున్నా వీళ్ళ ప్రవర్తన ఇలా వుందేమిటి?.. అని అనుకుంటూ వుంటారు, అంటారు కూడా.

అలా గమనిస్తే చాలా మందిలో ధ్యానం చేస్తే రావలసిన మార్పులు రావు. దీనికి ముఖ్య కారణం ధ్యానం ద్వారా వీరు శక్తి సంపాదించుకోకపోవడం కాదు. సంపాదించుకుంటున్నారు. కానీ కొన్ని పొరపాట్లు చేయడం వల్ల, కొన్ని తప్పుల వల్ల వీరు సంపాదించుకున్న శక్తిని కోల్పోతున్నారు. ఎందుచేతనంటే ధ్యాన సాధన వల్ల సందేహం లేకుండా శక్తి పెరుగుతుంది. కానీ వారు చేసే పొరపాట్ల వల్ల సంపాదించిన శక్తిని కోల్పోవడమే కాదు. మళ్ళీ మామూలు స్థితికి వచ్చేస్తారు, మామూలుగానే ప్రవర్తిస్తారు.

ఉదాహరణకు పైన వున్న నీళ్ళ ట్యాంకులో మోటారుతో నీళ్ళు తోడుతున్నాం. కానీ టాంకుకు అడుగున వున్న చిల్లులు గమనించలేదనుకోండి. అపుడు ఏమవుతుంది? తోడిన నీళ్ళన్నీ కారిపోతాయి కదా? ఎంత తోడినా, ఎన్నాళ్ళు తోడినా టాంకు నిండదు కదా? తోడిన శ్రమ అంతా వృధా అవుతుంది కదా? దీనికి ముఖ్య కారణం టాంకు క్రింద వున్న చిల్లులు చూసుకోకపోవడమే. అదే కనుక ఆ చిల్లులు పూడ్చి నీళ్ళు తోడితే... అప్పుడు ఆ ట్యాంక్ ఎంత తొందరగా నిండిపోతుందో చూడండి? దీనిని బట్టి "నీళ్ళు తోడడం ఒక్కటే ముఖ్యం కాదు. ట్యాంకు క్రింద చిల్లులు లేకుండా చూసుకోవడం కూడా ముఖ్యమే అని అర్థమవుతుంది" అంటే దృష్టి నీళ్ళు తోడడం మీదే కాదు, క్రింద చిల్లుల మీద కూడా పెట్టాలి.

అలాగే చాలా మంది కష్టపడి ధ్యాన సాధన చేసి శక్తి సంపాదించుకుంటున్నారు కానీ వారిలోని కొన్ని లోపాల వల్ల, తప్పుల వల్ల వారు సంపాదించిన శక్తిని పూర్తిగా కోల్పోతున్నారు. అందుచేత **"శక్తిని సంపాదించు కోవడం ముఖ్యం కాదు. సంపాదించిన శక్తిని కోల్పోకుండా చూసుకోవడమే ముఖ్యం"**. అంటే **"ఎంత సాధన చేసాము? ఎంత శక్తి సంపాదించాము? అన్నది ముఖ్యం కాదు, సంపాదించిన శక్తి కోల్పోకుండా వున్నామా? లేదా? అన్నదే ముఖ్యం"**. అంటే **"సాధన చెయ్యడం ముఖ్యం కాదు, తప్పులు చెయ్యకుండా వుండటమే ముఖ్యం"** అంటే తప్పులు, లోపాలు లేకుండా సాధన చెయ్యాలి. కారణం కొద్దిపాటి ధ్యాన సాధన చేసినా ఎన్నో లాభాలు పొందగలం. మనలో ఎంతో మార్పు వస్తుంది. అందుచేత లోపాలు లేకుండా చూసుకోవాలి.

చూడండి సంపాదించినదంతా ఖర్చు చేసేస్తే ఎన్ని లక్షలు సంపాదిస్తే ప్రయోజనమేమిటి? ప్రస్తుతం ఏమీ లేనట్టే కదా?... కానీ వేలు సంపాదించినా ఖర్చు చెయ్యకపోతే ఆ వేలయినా కనిపిస్తాయి. మెల్లిగా అవే లక్షలవుతాయి. అంటే **"ఇక్కడ సంపాదించడం ప్రధానం కాదు. ఖర్చు కాకుండా వుండటమే ప్రధానం"**. అలాగే "ధ్యానం ద్వారా శక్తి సంపాదించడం ప్రధానం కాదు. సంపాదించిన శక్తి ఖర్చు కాకుండా చూసుకోవడమే ప్రధానం" అంటే "తప్పులు చెయ్యకపోవడమే ప్రధానం. అంటే లోపాలు లేకుండా సాధన చెయ్యడమే ముఖ్యం".

మరి ఏ ఏ విషయాలలో సాధకులు నష్టపోతున్నారు? శక్తిని కోల్పోతున్నారు? సంపాదించిన శక్తిని ఎలా కోల్పోతున్నారు? ఎందుకు ఎంత సాధన చేసినా ఎదగ లేకపోతున్నారు? ఎప్పుడూ అలాగే వుంటున్నారు? అలాగే ప్రవర్తిస్తున్నారు. గొప్పవారిగా ఎందుకు కాలేకపోతున్నారు? ఎందుకు మార్పు రావడం లేదు? ఎక్కడ లోపం వుంది? ఈ విషయాలు కొన్ని తెలుసుకుందాం.

ముఖ్యంగా ఆహార నియమాలు పాటించకపోవడం ఒక కారణం. అందువల్ల శక్తిని కోల్పోతున్నారు, శక్తిని పెంచుకోలేకపోతున్నారు. అందుచేత ధ్యాన సాధకులు ఆహార నియమాలు పాటించాలి. సాత్వికమైన శాకాహారం మాత్రమే తీసుకోవాలి. మాంసాహారం, గుడ్లు తినకూడదు. అంతేకాదు శక్తి కోల్పోవడానికి మరొక కారణం కూడా వుంది. చాలా మంది సంకల్ప ధ్యానాలు చేస్తున్నారు. అంటే సంకల్పం పెట్టుకుని ధ్యానం చేస్తున్నారు. ఇందువల్ల కూడా చాలా మంది శక్తిని కోల్పోతున్నారు.

ఎందుచేతనంటే చాలా మందికి అసలు సంకల్పమంటే ఏమిటో కూడా తెలియదు. సంకల్పానికి, కోరికకు వున్న తేడా తెలియదు. వికల్పమంటే ఏమిటో తెలియదు. సంకల్ప శుద్ధి అంటే ఏమిటో? సంకల్ప శక్తి ఎలా పెరుగుతుందో? తెలియదు. సంకల్ప శక్తి పెరగాలంటే ఏం చెయ్యాలో తెలియదు. ఇవన్నీ తెలుసుకోకుండా, ఆలోచించకుండా ఎవరు ఏది చెబితే, ఎలా చెబితే అలా చేసేస్తున్నారు. తాము నష్టపోతున్నామన్న సంగతి కూడా తెలుసుకోలేకపోతున్నారు. అందుచేత ముందు ఈ విషయాలన్నీ ఆలోచిద్దాం, తెలుసుకుందాం. ముఖ్యంగా ముందు కోరిక అంటే ఏమిటి? సంకల్పం అంటే ఏమిటి? అన్నవి తెలుసుకుందాం.

# కోరిక - సంకల్పం

ముఖ్యంగా ఇది ఆలోచించండి. ఎవరైనా గుడికి కానీ, ప్రార్ధనా మందిరానికి కానీ వెళ్ళినపుడు తమ కోరికలు ఆ దైవానికి మనస్సులో చెప్పుకుంటారు. అంటే తమకు కావలసినవి మనస్సులో అనుకుంటారు. అలా మనస్సులో అనుకున్న దానిని కోరిక అంటారు.

అలాగే ప్రస్తుతం సంకల్పం పెట్టుకుంటున్న వారు కూడా తమ కష్టాలు తీరాలని, రోగాలు నయమవ్వాలని, సమస్యలు పోవాలని, అనుకున్నవి అవ్వాలని మనస్సులోనే అనుకుంటున్నారు. చూస్తే అక్కడా... ఇక్కడా... రెండూ మనస్సులో అనుకునేవే! మరి ఈ రెండింటికి తేడా ఏమిటి? ఇది ముఖ్యంగా ఆలోచించాలి! తెలుసుకోవాలి! అందుచేత కోరికకు, సంకల్పానికి వున్న తేడా ఏమిటో తెలుసుకుందాం.

కోరికలు మనస్సులో అనుకునేవి. సహజంగానే ప్రతి ఒక్కరికి సమస్యలు, కష్టాలు వుంటాయి. ఒకరకంగా సమస్యలు లేని వారు అంటూ ఎవరూ వుండరు. అంతేకాదు సమస్యలు బాధాకరం. ఆ బాధ భరించలేక ఎవరైనా ఆ బాధ నుంచి బయటపడాలని చూస్తారు. తేలికగా, తొందరగా బయటపడాలని కూడా చూస్తారు. అందుచేత తమకు ఇష్టమైన దైవాన్నితమ కష్టాలు తొలగించమని, తమ కోరికలు తీర్చమని మనస్సులో ప్రార్థిస్తారు. ఆ దైవమే అన్నీ ఇస్తాడని, అన్నీ తీరుస్తాడని, నెరవేరుస్తాడని ఆశతో ఎదురుచూస్తూ వుంటారు. తీరితే దైవ కృప అంటారు. తీరకపోతే నా కర్మ అనుకుంటారు. గమనిస్తే ఇక్కడ ఏ రకమైన కృషి కనిపించదు. అలా కృషి లేనిదానినే కోరిక అంటారు.

తెలుసుకోండి **"అనుకున్నది అవ్వాలని అనుకుని కూర్చుంటే దానిని 'కోరిక అంటారు'. కానీ అనుకున్నది సాధించడం కోసం విశేషంగా కృషి చేస్తే దానిని 'సంకల్పమంటారు' ".**

అంటే **"కోరుకున్నవాడు కూర్చుంటాడు. సంకల్పించిన వాడు కృషి చేస్తాడు".**

గమనిస్తే ఈ రెండింటికి వున్న తేడా కృషి ఒక్కటే! ఎందుచేతనంటే రెండూ మనస్సులో అనుకునేవే. కానీ కోరికలో కృషి వుండదు. సంకల్పంలో కృషి వుంటుంది. అందుకే సంకల్పించిన వాడు కృషి చేస్తాడు. అందుచేత **"కృషి లేకపోతే కోరిక అంటారు. కృషి వుంటే సంకల్పమంటారు".**

ఒకరకంగా **"కావాలనుకోవడం కోరిక. చెయ్యాలనుకోవడం సంకల్పం".** రెండూ అనుకునేవే. కానీ ఇక్కడ "కోరుకున్నవాడు కూర్చుంటాడు. చెయ్యాలని సంకల్పించుకున్న వాడు కృషి చేస్తాడు". ఉదాహరణకు చూడండి ఏదైనా గుడికి వెళ్ళినపుడో, ప్రార్థనా మందిరానికి వెళ్లినపుడో వారి యొక్క కోరికలు మనస్సులో

కోరుకుంటారు. ఎప్పుడు నెరవేరతాయా అని ఆశతో ఎదురు చూస్తూ వుంటారు. కానీ సంకల్పించుకున్న వారు సాధించడానికి కృషి చెయ్యడం ప్రారంభిస్తారు. ఏది సంకల్పిస్తే ఆ కృషే చేస్తారు. ఎలాంటిది సంకల్పిస్తే అలాంటి కృషే చేస్తారు.

ఉదాహరణకు పత్రీజీనే తీసుకుందాం. ఆయన 20-30 సంవత్సరాల క్రితం ఈ ప్రపంచానికి 2012 అంతానికల్లా ధ్యానం తెలియచెయ్యాలని అనుకున్నారు. అంటే సంకల్పించారు. అలా సంకల్పించి ఆయన ఇంట్లో ధ్యానం చేస్తూ కూర్చున్నారా? లేదు కదా? ఆయన అనుకున్న దానిని సాధించడం కోసం అప్పటి నుంచి విశేషంగా కృషి చేసారు. గమనిస్తే ఆయన మామూలుగా కృషి చెయ్యలేదు. అవిశ్రాంతంగా, అహర్నిశలు కృషి చేసారు. ఎవరూ చెయ్యలేనంతగా కృషి చేసారు. ప్రపంచమంతా సుడిగాలిలా పర్యటించారు. దీనినే సంకల్పమంటారు. ఆయన సంకల్పం అంత గొప్పది. ఆయనకు అపారమైన 'సంకల్ప శక్తి' వుంది. అందుకే అంతకృషి చెయ్యగలిగారు. అసాధ్యమైన దానిని సుసాధ్యం చెయ్యగలిగారు.

అంతేకానీ కృషి చెయ్యకుండా కూర్చుని ధ్యానం చేస్తే అది సంకల్పమవ్వదు. కోరిక అవుతుంది. అంటే అందరూ సంకల్పించి ధ్యానం చెయ్యడం లేదు. కోరుకుని ధ్యానం చేస్తున్నారు. గుర్తుంచుకోండి **"చెయ్యాలని సంకల్పించినవాడు కూర్చోడు, కృషి చేస్తాడు. కోరుకున్న వాడు కృషి చెయ్యడు కూర్చుంటాడు".**

అంతేకాదు ఏది చెయ్యాలనుకుంటే దానికి సంబంధించిన కృషి చేస్తారు. అంటే ఏది సంకల్పించుకుంటే ఆ కృషే చేస్తారు. ఉదాహరణకు మీరు ఇండ్లీ సాంబారు తినాలని సంకల్పించుకుంటే పప్పు నాన బెడతారు, తరువాత పొట్టు తీస్తారు, గ్రైండర్‌లో రుబ్బుతారు, నూక కలుపుతారు. కుక్కర్‌లో ఉడకపెడతారు. అలాగే సాంబారు కూడా తయారు చేస్తారు. తరువాత చక్కగా తింటారు. అంతేకాని ఇడ్లీ సాంబారు తినాలని అనుకుని ఏమీ చెయ్యకుండా కూర్చుంటే అది తినాలనే కోరిక అవుతుంది తప్ప సంకల్పమవ్వదు. అంతేకాదు అలా ఇడ్లీ సాంబారు తినాలని సంకల్పం పెట్టుకుని కృషి చెయ్యకుండా కూర్చుని ధ్యానం చెయ్యండి. తినగలరా? ఎప్పటికి తినగలరు? ఎప్పటికి తినలేరు. ఎప్పటికీ మీ సంకల్పం నెరవేరదు.

తెలుసుకోండి ఈ సృష్టిలో కృషి చేస్తేనే ఎవరైనా ఏదైనా సాధించగలరు. కష్టపడితేనే ఏ ఫలితమైనా వస్తుంది. అందుకే "కృషితో నాస్తి దుర్భిక్షమ్" అని అంటారు. అంతేకాదు "కష్టేఫలి" అని కూడా అంటారు. అంటే కష్టపడినవాడికే ఫలితం వుంటుంది.

అందుచేత ఎవరైనా అనుకుని ధ్యానం చేస్తూ కృషి చెయ్యకుండా కూర్చుంటే దానిని సంకల్పం అనరు, కోరిక అంటారు. వారు కోరికనే సంకల్పమని పిలుచుకుంటున్నారు. మరొక్కసారి తెలుసుకోండి. **"సంకల్పించిన వారు కృషి చేస్తారు. ఏది సంకల్పిస్తే ఆ కృషే చేస్తారు, ఏదీ సంకల్పించకపోతే ఏ కృషి చెయ్యరు.**

**అలాగే ఒకటి సంకల్పించి ఇంకొకటి కృషి చెయ్యరు".**

ఉదాహరణకు ఇడ్లీ సాంబారు తినాలని సంకల్పించి... పూరీ, కూర చెయ్యరు. కారణం ఇడ్లీ సాంబారు సంకల్పించారు కాబట్టి. అలాగే పుస్తకం చదవాలని సంకల్పిస్తే టి.వి. చూడరు... పుస్తకమే చదువుతారు. అలాగే ఏ పుస్తకం చదవాలని సంకల్పిస్తే ఆ పుస్తకమే చదువుతారు. అలాగే కొత్తగా బట్టలు కుట్టించుకోవాలని సంకల్పిస్తే బట్టలు కుట్టించుకుంటారు, బంగారు గాజులు చేయించుకోవాలని సంకల్పిస్తే బంగారు గాజులు చేయించుకుంటారు. ఇంట్లో ఫర్నీచర్ చేయించుకోవాలని సంకల్పిస్తే ఫర్నీచర్ చేయించుకుంటారు. ఏమీ సంకల్పించుకోకపోతే ఏమీ చెయ్యరు.

ఒక రకంగా మీరు చెయ్యగలిగిన వాటినే సంకల్పిస్తారు. చెయ్యలేని వాటిని సంకల్పించరు. ఒకవేళ సంకల్పించినా అది తీరని కోరికగానే మిగిలిపోతుంది. అపుడు మీరు మధ్య మధ్యలో ఆప్తులతో అంటూ వుంటారు... కారు కొనాలనే కోరిక, మేడ కట్టుకోవాలనే కోరిక, రవ్వల నెక్లెస్ చేయించుకోవాలనే కోరిక, అమెరికా వెళ్ళాలనే కోరిక ఇంకా తీరలేదు... అలా తీరని కోరికలు చాలా వున్నాయని అంటూంటారు. అంతేకాని సంకల్పాలు వుండిపోయాయని అనరు.

కానీ ప్రస్తుతం కొంతమంది నీకు కావలసింది అనుకుని అంటే మనస్సులో సంకల్పం పెట్టుకుని ధ్యానం చెయ్యి, నీ సమస్య తీరిపోతుంది, నీ రోగాలు నయమవుతాయి. నువ్వు అనుకున్నది అవుతుంది అని అనగానే సహజంగానే ఎవరికైనా ఆశ కలుగుతుంది, చాలా సులువనిపిస్తుంది, బాగా నచ్చుతుంది కూడా! ఎందుచేతనంటే వారు సమస్యలోంచి బయటపడాలి కదా? అందుచేత ఇంకేమీ ఆలోచించరు, అలాగే చేసేస్తుంటారు. కానీ ఇక్కడ తప్పనిసరిగా ఆలోచించాలి. ముందు అసలు కోరిక అంటే ఏమిటి? సంకల్పం అంటే ఏమిటి? అన్నవి తెలుసుకోవాలి.

ఎందుచేతనంటే చాలామందికి తీరని కోరికలు చాలా వుంటాయి. ఉదాహరణకు కొంతమందికి తమ అబ్బాయిని కలెక్టరు చెయ్యాలనే కోరిక వుంటుంది. కానీ వాడు అవ్వలేదు. ఏజ్‌బార్ అయిపోయింది. కలెక్టరు అవుతాడా? అంటే అవ్వలేదు కదా? అలా అవ్వలేదని మా అబ్బాయి కలెక్టరు కావాలని సంకల్పించుకుని ధ్యానం చేస్తే ఏజ్ బార్ అయిన మీ అబ్బాయి కలెక్టరు అవ్వగలడా? ఎప్పటికీ కాలేడు. ఎంతమంది చేత సంకల్పాలు పెట్టించి ధ్యానం చేయించినా అవ్వలేడు కదా? అందుచేత అది మీ కోరికే అవుతుంది కానీ, మీ సంకల్పం కాదు. అదే కనుక చిన్ననాటి నుండి కలెక్టరు అవ్వాలని మీ అబ్బాయి సంకల్పించుకుని దానికి తగ్గ కృషి చేస్తే, కష్టపడితే అయితే అవ్వవచ్చు, లేకపోతే లేకపోవచ్చు అది వాడి కృషిని బట్టి ఆధారపడి వుంటుంది. అంతే తప్ప కనీసం డిగ్రీ పాస్ కాకుండా, కృషి

చెయ్యకుండా ధ్యానం చేస్తే మీ అబ్బాయి కలెక్టర్ ఎలా అవుతాడు?

అలాగే చాలా మంది చిన్ననాటి నుండే వారికి నచ్చిన మార్గాన్ని నిర్ణయించుకుని సాధించాలని సంకల్పించుకుంటారు, విశేషంగా కృషి చేస్తారు. చివరకు అనుకున్నది సాధిస్తారు. అలా మంచి డాన్సర్ అవ్వాలని సంకల్పించుకుంటే చిన్న నాటి నుండి డాన్స్ ప్రాక్టీసు చేస్తారు, ఇంకొక దాని మీద దృష్టి వుంచరు, చివరకు డాన్సర్ అవుతారు. అలాగే సింగర్ అవ్వాలని సంకల్పించుకుంటే సంగీతం నేర్చుకుంటారు, విశేషంగా సాధన చేస్తారు, మంచి సింగర్ అవుతారు. అలాగే క్రికెటర్ అవ్వాలని సంకల్పించుకుంటే చిన్న నాటి నుండి క్రికెట్ ప్రాక్టీసు చేస్తారు. చివరకు ఛాంపియన్ అవుతారు.

అలా క్రికెట్ ఛాంపియన్ అవ్వాలని సంకల్పించుకున్నవాడు డాన్స్ ప్రాక్టీసు చెయ్యడు. అలాగే డాన్స్ ప్రాక్టీసు చేసేవాడు ఎప్పటికీ క్రికెట్ ఛాంపియన్ కాలేడు. అలా అనుకున్నది సాధించడమన్నది వారి సంకల్ప బలాన్ని బట్టి వుంటుంది. వారి సంకల్పం బలంగా వుంటే వారి కృషి తీవ్రంగా వుంటుంది. అందుచేత వారి సంకల్పం బలంగా వుందా? లేదా? అన్నది వారు చేసే కృషిని బట్టి మనం తెలుసుకోవచ్చు. వారి కృషి సరిగా లేకపోతే వారి సంకల్పం బలంగా లేదని మనం అర్థం చేసుకోవచ్చు.

అందుచేత తెలుసుకోండి **"గట్టిగా సంకల్పం పెట్టుకుంటే... కృషి గట్టిగా చెయ్యరు. వాడిది బలమైన సంకల్పమైనపుడే కృషి తీవ్రంగా వుంటుంది". "కృషి తీవ్రంగా వుంది అంటే వాడి సంకల్పం బలంగా వుందని మనం అర్థం చేసుకోవచ్చు".** అది ఒకరు చెపితే పెట్టుకునేది కాదు, గట్టిగా అనుకునేది కాదు. అది సహజంగానే వారిలో రావాలి. ఒకరు చెపితే వచ్చేది కాదు. అది బలంగా వారిలో వుంటే ఇంకొకరు చెప్పవలసిన అవసరం లేకుండానే కృషి చేస్తారు, సాధిస్తారు. లేనపుడు సంకల్పం గట్టిగా పెట్టుకోవాలని ఎంత చెప్పినా, వూరికే ధ్యానం చేసినా ప్రయోజనం ఉండదు.

మరొక్కసారి తెలుసుకోండి "సంకల్పించుకున్నవాడు కృషి చేస్తాడు. కోరుకున్నవాడు కూర్చుంటాడు". అలాగే సంకల్ప బలాన్ని బట్టే కృషి కూడా వుంటుందని తెలుసుకోవాలి. ఎలాంటి సంకల్పమయితే అలాంటి కృషి వుంటుందని కూడా తెలుసుకుందాం. ఇక్కడ కొన్ని సందేహాలు నివృత్తి చేసుకుందాం.

కొంతమంది అడగవచ్చు మేము సంకల్పం పెట్టుకుని ధ్యానం చేస్తే మేము అలా అనుకున్నవి కొన్ని అయ్యాయి, కొన్ని జరిగాయి, మరి అవి ఎలా జరిగాయి? అని సందేహం వ్యక్తం చేయవచ్చు.

కానీ గమనిస్తే చాలా మంది అలా అనుకుని ధ్యానంలో కూర్చుంటారు. సహజంగా కొంతమందికి జరుగుతాయి, అనుకున్నవి నెరవేరతాయి. కానీ అందరికీ అవ్వవు, అనుకున్న ఫలితాలు రావు. మరి ఏమిటి దీనికి కారణం?

అలా సంకల్పం పెట్టుకుని ధ్యానం చేస్తే అందరికీ అవ్వాలి కదా? ఎందుకు

అవ్వలేదు? కొంతమందికే ఎందుకు అయ్యింది? అపుడు అయిన వారిని ఆ మాష్టరు చూశావా నేను చెప్పాను అయ్యింది అంటాడు. అవ్వని వారిని ఆ మాష్టరు ఏమంటాడంటే నువ్వు 'సంకల్పం గట్టిగా పెట్టుకోలేదు- గట్టిగా సంకల్పించుకో!' అని చెపుతాడు. ఒకవేళ ఎవ్వరైనా మేము గట్టిగానే పెట్టుకున్నాం అయినా అనుకున్నది అవ్వలేదు అంటే అపుడు ఆ మాష్టరు నీ ఎనర్జీ లెవెల్స్ సరిపోలేదు. అందుకే అవ్వలేదు. అందుచేత ఇంకా ధ్యానం బాగా చెయ్యి, ఎనర్జీ పెంచుకో... అపుడు నువ్వు అనుకున్నది జరుగుతుంది అని అంటాడు. కానీ ఇక్కడ ఆలోచించవలసింది వుంది. అలా అనుకుని కూర్చుని ధ్యానం చేస్తే అది సంకల్పమనరు... కోరిక అంటారు. అంటే కోరుకుని ధ్యానం చేసారన్నమాట. అంటే కోరుకుని ధ్యానం చేస్తే కొంతమందికి జరిగింది, కొంతమందికి జరగలేదు. దీనికి కారణం తెలుసుకోవాలి.

తెలుసుకోండి గట్టి సంకల్పం అంటే గట్టిగా అనుకోవడం కాదు. వికల్పం లేకుండా వుండడం. అంటే **"వికల్పం లేని సంకల్పమే గట్టి సంకల్పం".** అలాంటి సంకల్పమే ఎవరికైనా సిద్ధిస్తుంది. అందుచేత ఎవరి సంకల్పమైనా సిద్ధించాలంటే! అంటే నెరవేరాలంటే! వికల్పం వుండకూడదని తెలుసుకోవాలి. అందుచేత వికల్పం అంటే ఏమిటి? వికల్పం లేని సంకల్పం ఎలా సాధ్యమో అన్నది తరువాత తెలుసుకుందాం.

మరి అలా అనుకుని కూర్చుని ధ్యానం చేసినపుడు కొంతమందికి ఎందుకు జరిగింది? కొంతమందికి ఎందుకు జరగలేదు? అంతేకాదు అలా జరిగిన వారికి మరల ఇంకొకసారి జరగదు. అసలు వీటికి కారణమేమిటి? ఇది మనం ముఖ్యంగా తెలుసుకోవాలి.

ముఖ్యంగా ధ్యానం చేసేకొద్దీ ప్రతి ఒక్కరిలో శక్తి పెరుగుతూ వుంటుంది. విశేషంగా ధ్యానం చేసినపుడు విశేషంగా శక్తి పెరుగుతుంది. అలా విశేషమైన ధ్యానం చేసి విశేషంగా శక్తి సంపాదించుకున్నవారు ఏమైనా కోరుకుంటే ఆ కోరిక నెరవేరుతుంది. కారణం వారు కోరుకున్న కోరికకు తగ్గ శక్తి వారికి వుంది కాబట్టి. అలాగే వారి కోరికకు తగ్గ శక్తి లేకపోతే వారి కోరిక నెరవేరదు.

ఇక్కడే ఒక విషయం తెలుసుకోవాలి. శక్తి వున్న వారి కోరిక నెరవేరుతుంది. కానీ అప్పటి దాకా వారు ధ్యానం ద్వారా సంపాదించుకున్న శక్తి అంతా కోల్పోతారు. తిరిగి సాధనలో మామూలు స్థితికి చేరుకుంటారు. అంటే కోరిక నెరవేరుతుంది కానీ శక్తి కోల్పోతారు. ఇటువంటి వారు మరల ఇంకొక సంకల్పం చేసుకుంటే, అంటే కోరుకుంటే, ఆ సంకల్పం నెరవేరదు. కారణం వారు శక్తి కోల్పోవడమే. ఒక సంకల్పం నెరవేరి, ఇంకొక సంకల్పం నెరవేరకపోవడానికి కారణం ఇదే. అలాగే ఎంత ధ్యానం చేసినా సంకల్పాలు, అంటే కోరికలు నెరవేరకపోవడానికి కారణం వారిలో తగినంత శక్తి లేకపోవడమే.

ఇటువంటి పరిస్థితుల్లో కొంతమంది మరి మేము సంకల్పించుకోకపోతే మా సమస్యలు ఎలా తీరతాయి? మా బాధలు ఎలా పోతాయి? అని అడగవచ్చు. కానీ తెలుసుకోండి కోరకుండా అంటే సంకల్పం పెట్టుకోకుండా ధ్యానం చేసినా... వారి కోరికకు తగ్గ ధ్యాన సాధన చేసి, శక్తి సంపాదించుకుంటే చాలు వారి కోరిక సహజంగానే నెరవేరుతుంది. కానీ ఇక్కడ మరొక లాభం ఏమిటంటే వారి శక్తి ఖర్చు కాదు. కానీ కోరుకుంటే మాత్రం వారి శక్తి కర్చయిపోతుంది. అందుచేత కోరకుండా ధ్యానం చెయ్యడమే ఎవరికైనా ఉత్తమం. కారణం సమస్యా పరిష్కారమవుతుంది; శక్తి ఖర్చు కాదు. అందుచేత **"కృషి మీరు చెయ్యండి. ఫలితం ప్రకృతికి వదిలెయ్యండి".** కారణం **"కర్మ చెయ్యడానికే మనకు అధికారం వుంది కానీ, మనం చేసిన దానికి ఫలితం కోరే అధికారం మనకు లేదు".**

అందుచేత తెలుసుకోండి భగవంతుని సృష్టిలో కోరకుండా సాధన చేసేవారు రెండు రకాలుగా లాభం పొందుతారు. కానీ కోరుకున్నవారు రెండు రకాలుగా నష్టపోతారు. ఎందుచేతనంటే వారు శక్తి కోల్పోవడమే కాదు, ఒక సమస్య తీరినా మరల సమస్యలు వస్తూనే వుంటాయి. అపుడు వారు ఏమీ చెయ్యలేరు. కనీసం సమస్యను తట్టుకునే శక్తి కూడా వారికి ఉండదు. కారణం శక్తి కోల్పోయారు కాబట్టి. అందుకే శాస్త్రాలలో "కృషి చేయమన్నారు కానీ కోరుకోమనలేదు".

ఇదే విషయం భగవద్గీతలో స్పష్టంగా చెప్పబడింది. అందుకే శాస్త్రాలలో **"చేసుకున్న వాడికి చేసుకున్నంత మహదేవ"** అన్నారు కానీ **"కోరుకున్న వాడికి కోరుకున్నంత మహదేవ"** అనలేదు.

ముఖ్యంగా శ్రీ కృష్ణుల వారు "నిష్కామ కర్మ చెయ్యమన్నారు" అంటే "ఏ కర్మ చేసినా అంటే ఏ పని చేసినా ప్రతిఫలం ఆశించవద్దన్నారు, అంటే కోరవద్దన్నారు".

ఆయన ఇంకా 'కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కధాచనా!" అన్నారు. అంటే "కర్మ చేయడానికే నీకు అధికారం వుంది కానీ, ఫలితం ఆశించడానికి నీకు అధికారం లేదు" అన్నారు. అంటే కోరడానికి అధికారమే లేదు అని చెప్పడం జరిగింది.

ఆయన ఇంకా ఏమి చెప్పారంటే "కతృత్వ భావం లేకుండా చెయ్యమన్నారు". అంటే "నేను చేస్తున్నాను అన్న భావం కూడా వదిలివెయ్యమన్నారు". అంటే నేను అనేదే లేనపుడు అసలు కోరడమెక్కడ వుంటుంది?

అంతేకాదు ఆయన ఇంకా ఎంత వరకు చెప్పారంటే "అన్నిటికంటే కర్మ ఫల త్యాగం గొప్పది" అన్నారు. అంటే మనం చేసే ఏ కర్మకైనా ఫలితం ఆశించవద్దు, వదిలిపెట్టమన్నారు. అదే అన్నిటి కంటే గొప్పదని చెప్పారు. అంటే ధ్యానం చేసినా, ఫలితం ఆశించ కూడదనే దాని అర్థం. కానీ మనం ధ్యానం కంటే ముందే సంకల్పించుకుంటున్నాం, అంటే కోరుకుంటున్నాం, అంటే ఆశిస్తున్నాం, అంటే భగవానుడు చెప్పిన దానికి విరుద్ధంగా చేస్తున్నాం. అలా చేస్తే నష్టపోయేది మనమేగా?

అందుచేత మనల్ని శక్తివంతుల్ని చేసే ధ్యాన సాధన చేసేటపుడు సంకల్పాలు అంటే కోరుకోవలసిన అవసరం లేదని తెలుసుకోవాలి.

భగవద్గీతలోని ఈ క్రింది శ్లోకం చూడండి.

**శ్లో॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।**
**జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పణ్డితం బుధాః ॥ (భ.గీ.4-19)**

తా:- ఎవరి యొక్క సమస్త కర్మలు కోరిక, సంకల్పాలు లేకుండా ప్రారంభం అవుతాయో; ఎవరి యొక్క కర్మలన్నీ జ్ఞానాగ్ని చేత భస్మమవుతాయో! అటువంటి వానిని విజ్ఞులు, పండితుడని పేర్కొంటారు.

పై శ్లోకాన్ని బట్టి ఎవరైనా కర్మలు చేసేటపుడు కోరికలు కానీ, సంకల్పం కానీ లేకుండా చేయాలని, వాడే గొప్పవాడని శ్రీ కృష్ణుల వారు చెప్పడం జరిగింది. అందుచేత ఆఖరికి ధ్యానం చేసినా, కోరికలు కానీ, సంకల్పాలు కానీ లేకుండా చెయ్యాలని దీనిని బట్టి మనం తెలుసుకోవచ్చు.

ఎందుచేతనంటే ఈ సృష్టిలో **"చేయవలసింది చేస్తే పొందవలసింది తప్పకుండా పొందుతారు"**. తెలుసుకోండి **"చేసుకున్నవాడు కోరకపోయినా పొందవలసింది పొందుతాడు. అలాగే చేసుకోని వాడు కోరినా పొందలేడు"**. ఇదే యీ సృష్టిలోని ఒక గొప్ప సిద్ధాంతం. అందుచేత తెలుసుకోండి! కోరుకుని అంటే సంకల్పించుకుని ధ్యానం చేసినవారు నష్టపోతారు. కానీ కోరకుండా అంటే సంకల్పించకుండా ధ్యానం చేసిన వారు అన్ని రకాలుగా లాభం పొందుతారు.

కోరి ధ్యానం చేస్తే సంపాదించుకున్న శక్తి ఎలా కోల్పోతామో బ్రహ్మర్షి విశ్వామిత్రుని కథ ద్వారా తెలుసుకుందాం.

విశ్వామిత్రుడు 1000 సంవత్సరాలు తపస్సు చేశాడు అంటే ధ్యానం చేశాడు. ఆయన అపారమైన శక్తి సంపాదించుకున్నాడు. ఎంత శక్తి సంపాదించాడంటే సృష్టికి ప్రతిసృష్టి చేయగలిగినంత శక్తి సంపాదించాడు. అలా అపారమైన శక్తిని సంపాదించిన విశ్వామిత్రుని చూసి ఇంద్రుడు భయపడ్డాడు. అంతటి శక్తి సంపాదించిన విశ్వామిత్రుడు లోకానికి మేలు చేస్తాడా? కీడు చేస్తాడా? అన్న సందేహంతో విశ్వామిత్రుడ్ని పరీక్షించదలుచుకున్నాడు.

మేనకను పంపించాడు. మేనక సౌందర్యాన్ని చూసి విశ్వామిత్రుడు మోహించాడు. నన్ను వివాహం చేసుకోమని కోరాడు. అపుడు మేనక ఒక షరతు పెట్టింది. ఏమని? ఎప్పుడయితే నా కోరిక కాదంటావో... అపుడు నిన్ను వదిలి వెళ్ళిపోతాను అంది. దానికి విశ్వామిత్రుడు అంగీకరించాడు. ఇద్దరూ వివాహం చేసుకున్నారు. కాపురం చేస్తున్నారు. కానీ మేనక విచిత్రమైన కోరికలు కోరేది. మల్లెపూలు లేని కాలంలో మల్లెపూలు కోరేది. మామిడిపళ్ళు లేని కాలంలో మామిడిపళ్ళు కోరేది. ఆవిడ మాట కాదనలేని విశ్వామిత్రుడు ఆవిడ కోరిక తీర్చడానికి

తాను సంపాదించిన శక్తిని కొంత ఖర్చు పెట్టి మల్లెపూలు సృష్టించేవాడు, మామిడిపళ్ళు సృష్టించేవాడు, ఒక్కోసారి నీతో కలిసి ఆకాశంలో విహరించాలని వుంది అనేది అలాగే మరి కొంత శక్తి ఖర్చు పెట్టి ఆమె కోరిక తీర్చేవాడు. ఇలా రకరకాల వింత కోరికలు మేనక కోరేది. ఆమె కోరికలు తీరుస్తానని మాట ఇచ్చిన విశ్వామిత్రుడు తన శక్తిని ఖర్చు పెడుతూ ఆమె కోరికలు తీర్చేవాడు.

అలా వుంటూ వుండగా మరల ఒకసారి ఆకాశ విహారం చేద్దామని మేనక మరల కోరింది. అపుడు విశ్వామిత్రుడు సరేనని చేతులు పైకి ఎత్తి... పైకి వెళ్దామనుకున్నాడు. కానీ ఈసారి పైకి లేవలేకపోయాడు. ఎంత ప్రయత్నించినా పైకి కదలలేకపోయాడు. అపుడు విశ్వామిత్రునికి అర్థమయ్యింది. తాను తపస్సు అంటే ధ్యానం ద్వారా సంపాదించిన శక్తి అంతా ఖర్చు అయిపోయిందని తెలుసుకున్నాడు. అపుడు మేనకతో నా శక్తి అంతా ఖర్చయిపోయింది. నేను పైకి లేవలేకపోతున్నాను అన్నాడు. అపుడు మేనక తాను పెట్టిన షరతు గుర్తు చేసి విశ్వామిత్రుణ్ణి వదిలేసి తాను స్వర్గానికి వెళ్ళిపోయింది. అపుడు విశ్వామిత్రుడు చాలా బాధపడ్డాడు. తాను ఎంతో కష్టపడి 1000 సంవత్సరాలు చేసిన తపశ్శక్తి అంతా ఖర్చయిపోయిందే! కామం కోసం అంటే మేనక కోరికలు తీర్చడం కోసం ఎంత శక్తిని నేను కోల్పోయాను అని బాధపడి మరల తపస్సు ప్రారంభించాడు. మరల 1000 సంవత్సరాలు తపస్సు చేశాడు. మరల అపారశక్తిని సంపాదించాడు.

ఈసారి ఇంద్రుడు రంభను పంపాడు. రంభను చూడగానే విశ్వామిత్రునికి అపారమైన కోపం వచ్చింది. ఇంద్రుడు నన్ను తెలివి తక్కువ వాడనుకుంటున్నాడు. వాడి పని చెపుతానని ఆగ్రహించి రంభను శిలగా మారిపొమ్మని శపించాడు. కానీ అలా శపించడం వల్ల మరల శక్తినంతా కోల్పోయాడు. మరల మామూలు మనిషి అయిపోయాడు. మరల ఎంతో బాధపడ్డాడు. చేసేది ఏమీ లేక మరల పట్టుదలతో తపస్సు చేసి మరల శక్తి సంపాదించాడు. అలా నాలుగుసార్లు శక్తిని సంపాదించి శక్తిని కోల్పోయాడు. చివరకు ఆఖరిసారిగా శక్తిని సంపాదించి అన్ని పరీక్షలు అధిగమించి బ్రహ్మర్షి అయ్యాడు, చాలా గొప్పవాడయ్యాడు.

అలా విశ్వామిత్రుని జీవితం మనం తీసుకుంటే ఆయన తపస్సు ద్వారా అంటే ధ్యానం ద్వారా సంపాదించిన శక్తిని కోరికల కోసం ఖర్చు చేసుకోవడం మరల సాధన చెయ్యడం మనం గమనించవచ్చు. అందుచేత ఎవరైనా సరే ధ్యానం చేసి సంపాదించిన శక్తిని కోరికలకు ఉపయోగించుకుంటే అంటే సంకల్పాలు పెట్టుకుంటే కోల్పోతారని తెలుసుకోవాలి. అందుచేత సంకల్పం పెట్టుకుని ధ్యానం చేసేవారు తాము సంపాదించుకున్న శక్తిని కోల్పోతారని తెలుసుకోవాలి. అంటే వారు మళ్ళీ మొదటికి వస్తారని తెలుసుకోవాలి. వారు ఎన్ని సంవత్సరాలు ధ్యానం చేసినా! ఎంత ఎక్కువ ధ్యానం చేసినా మళ్ళీ మామూలు స్థితిలోనే వుంటారు.

సామాన్యులుగా జీవిస్తారు. శక్తి లేని వారిగా ప్రవర్తిస్తారు.

అందుచేత శక్తి కోల్పోకూడదని తెలుసుకోవాలి. అంతేకాదు శక్తి పెరిగే కొద్దీ జీవితంలో వచ్చే లాభాలు తెలుసుకోవాలి. కష్టపడి చేసే ధ్యాన సాధన సంపాదించిన శక్తి చిన్న చిన్న కోరికల కోసం శక్తి వృధా చేసుకోకూడదు, నష్టపోకూడదు. ధ్యాన శక్తి యొక్క విలువ, గొప్పతనం తెలుసుకోవాలి. శక్తిని పెంచుకోవాలి. కారణం ప్రాపంచిక జీవితంలో మానవునకు ఎన్నో సమస్యలు వుంటాయి. ఒకవేళ శక్తి ఖర్చు పెట్టి ఏదో ఒక సమస్య పరిష్కరించుకున్నా మరల మరో సమస్య వస్తుంది. మానవుని జీవితంలో సమస్యలకు అంతం లేదు. అందుచేత శక్తి కోల్పోకుండా సమస్యల్ని పరిష్కరించుకోవాలి. అంటే సంకల్పం లేకుండా ధ్యానం చెయ్యాలి. అపుడు సమస్యలు పరిష్కారమవుతాయి... శక్తి కోల్పోరు. అందుచేత ధ్యానం చెయ్యండి. ఫలితం ప్రకృతికి వదిలెయ్యండి. అంతా లాభమే జరుగుతుంది.

అంతేకాదు అసలు కష్టాలు ఎందుకు వస్తున్నాయో తెలుసుకోండి. కష్టాలు రావడానికి కారణం మనం చేసే పాపకర్మలు అంటే జీవహింస, అధర్మ ప్రవర్తన. అందుచేత జీవహింస చేయకండి అంటే మాంసం తినకండి, ధర్మమంటే ఏమిటో తెలుసుకుని ధర్మంగా జీవించండి. జీవితంలో సమస్యలే రావు. ఆనందంగా జీవించగలుగుతారు. విశేషంగా ధ్యానం చెయ్యండి. జీవితమే లేని మోక్షాన్ని పొందుతారు.

కొంతమంది అడుగుతూ వుంటారు. మరి నేను ఎలాంటి సంకల్పాలు పెట్టుకోవాలి? వారికి మాష్టర్సు సలహా ఇస్తూ వుంటారు. సత్సంకల్పాలు పెట్టుకోవాలి. అంటే లోక కళ్యాణకరమైనవే సంకల్పించుకోవాలి. అలాంటి సంకల్పాలు పెట్టుకుంటే అవి నెరవేరతాయని కొంతమంది... మీ శక్తి పెరుగుతుందని కొంతమంది మాష్టర్సు సలహాలు ఇస్తూ వుంటారు. వీటి గురించి కూడా తెలుసుకుందాం.

గుర్తుంచుకోండి లోకకళ్యాణకరమైన సంకల్పాలు అంటే సత్సంకల్పాలు పెట్టుకుంటే అనుకున్నది అవ్వదు. మీ శక్తులు పెరగవు. ఇక్కడ ఏమి జరుగుతుందంటే మంచి సంకల్పాలు వున్నవారు లోకకళ్యాణకరమైన పనులు, మంచి పనులు చేస్తారు, అంటే వారు చేసే కృషి లోక కళ్యాణకరంగా వుంటుంది. అందరికీ లాభం చేకూర్చే విధంగా వుంటుంది. అటువంటి కృషికి సహజంగానే ప్రకృతి సహకరిస్తుంది. అంటే వారు చేసే కృషికి అనుకోని విధంగా సహకారం లభిస్తుంది, కలిసి వస్తుంది. చివరకు వారు అనుకున్నది తేలికగా సాధిస్తారు. అంటే సంకల్పం నెరవేరుతుంది. అంటే సంకల్పం సిద్ధించింది అంటాం.

అందుచేత మరొకసారి గుర్తుంచుకోండి, మంచి పనులు సంకల్పించుకుని కృషి ప్రారంభిస్తే అది ఎంతటి గొప్పకార్యమైనా సాధించగలుగుతారు. చేయగలుగుతారు.

అంతే కానీ ఏదో నేను మంచి సంకల్పం చేసుకున్నాను అని కూర్చుని ధ్యానం చేస్తూ కృషి చెయ్యకపోతే ఏమీ సాధించలేరు. అంతేకాదు వారి సంకల్పంలో వికల్పం వున్నా, సంకల్పం శుద్ధంగా లేకపోయినా అది సత్సంకల్పమైనా సిద్ధించదు, నెరవేరదు.

అంతేకాదు నువ్వు మంచి సంకల్పం, పెట్టుకున్నంత మాత్రాన నువ్వు శక్తిమంతుడు కాలేవు, నీ శక్తి పెరగదు. ధ్యానం చేస్తేనే ఎవరి శక్తి అయినా పెరుగుతుంది.

అందుచేత సంకల్పమంటే ఏమిటి? వికల్పమంటే ఏమిటి? సంకల్ప శుద్ధి అంటే ఏమిటి? సంకల్పశక్తి అంటే ఏమిటి? సంకల్ప సిద్ధి ఎలా కలుగుతుంది? అన్న విషయాలు ముందు తెలుసుకోవాలి. బ్రహ్మర్షి పత్రీజీ వీటన్నిటి గురించి విపులంగా సంకల్ప శక్తి అనే పుస్తకంలో ఇవ్వడం జరిగింది. బాగా అధ్యయనం చెయ్యండి.

## సంకల్పమంటే?

సంకల్పం గురించి మరింత వివరంగా తెలుసుకుందాం. సంకల్పమంటే అనుకున్నది సాధించడం కోసం ప్రయత్నించడం అంటే కృషి చెయ్యడం. అంటే సంకల్పించిన వారు, తాను ఏది సంకల్పిస్తే అది సాధించడం కోసం అంటే సిద్ధించడం కోసం కృషి చేస్తారు.

ఉదాహరణకు మంగళంపల్లి బాలమురళీకృష్ణ సంగీత విద్వాంసుడు కావాలని చిన్నప్పుడే సంకల్పించుకున్నారు. సంగీత సాధనలో విశేషమైన కృషి చేసారు. సంగీతంలో గొప్ప విద్వాంసుడయ్యారు. ఆయన సంగీత విద్వాంసుడు అవ్వాలని ఇంట్లో కూర్చుని సంగీత సాధన మానేసి ధ్యానం చెయ్యలేదు. అలాగే సచిన్ టెండూల్కర్ క్రికెట్ ఛాంపియన్ అవ్వాలని సంకల్పించుకున్నాడు. క్రికెట్‌లో చిన్ననాటి నుండి విశేషంగా ప్రాక్టీసు చేసాడు. అంటే కృషి చేసాడు క్రికెట్‌లో ఛాంపియన్ అయ్యాడు. అంతేకాని ప్రాక్టీసు చెయ్యకుండా ఛాంపియన్ అవ్వాలని సంకల్పం పెట్టి, ఇంట్లో కూర్చుని ధ్యానం చెయ్యలేదు.

అందుచేత సంకల్పం పెట్టుకుని అంటే కోరుకుని ధ్యానం చేస్తే అనుకున్నది అయిపోదు. ధ్యానం అన్నది నీ సంకల్ప శక్తిని పెంచుతుంది, అంటే సంకల్పశక్తి పెంచుకోవాలంటే ధ్యానమన్నది చాలా అవసరం. అలా సంకల్ప శక్తి వున్నవారే విశేషమైన కృషి చేస్తారు. విశేషమైన కృషి చేసిన వారే అనుకున్నది సాధిస్తారు.

## వికల్పమంటే?

ఒక పని చెయ్యాలని అనుకున్నప్పుడు వెంటనే రెండు ఆలోచనలు వస్తాయి. "ఆ..! నేనేం చేస్తాను! నా వల్ల అవుతుందేమిటి? అది నాకు సాధ్యమా? నేనేం చెయ్యగలను? నా వల్ల కాదేమో? అన్న ఆలోచనలు వస్తాయి. అలాంటి ఆలోచనలను

"వికల్పం" అంటారు.

నా వల్ల అవుతుంది. "నేను చేస్తాను" అన్న ఆలోచనలనే "సంకల్పం" అంటారు. "ఆ నా వల్ల అవుతుందేమిటి? వాళ్ళు నేను చెప్పినట్టు వింటారా? నా తల రాత ఎలా వుంటే అలా అవుతుంది! మానవుడు ఒకటి తలిస్తే దైవం వేరొకటి తలుస్తాడు కదా? లాంటి ఆలోచనలు వికల్పాలు అంటారు.

ఒక రకంగా 'సంకల్పం' అంటే పాజిటివ్ థాట్! అంటే సకారాత్మక ఆలోచనలు... నేను చేస్తాను. నేను సాధిస్తాను, నేను చెయ్యగలను, తప్పకుండా నా వల్ల అవుతుంది. నేను వెళ్ళగలను, నేను మాట్లాడగలను, నేను ఎక్కగలను లాంటి ఆలోచనలు.

అలాగే వికల్పం అంటే నెగెటివ్ థాట్! అంటే "నకారాత్మక ఆలోచనలు". నా వల్ల కాదు అన్న ఆలోచనలు.

## విరుద్ధ సంకల్పాలు

మనం పరస్పర విరుద్ధమైన సంకల్పాలు చేస్తే ఏదీ సాధించలేము. అంటే సంకల్పం నెరవేరదు. నేను క్రికెట్ ఛాంపియన్ కావాలి. నేను సినిమాలో హీరోని కూడా కావాలి. ఈ రెండూ పరస్పర విరుద్ధమైన సంకల్పాలు ఈ రెండూ ఎలా కుదురుతాయి? మనం క్రికెట్ ఛాంపియన్ అవ్వాలనుకుంటే సినిమా హీరో గురించి ఆలోచించడం మరచిపోవాలి. సినిమా హీరో కావాలనుకుంటే క్రికెట్ ఛాంపియన్ గురించి ఆలోచించడం మరచిపోవాలి. ఈ రెండూ పరస్పర విరుద్ధం.

అందుచేత ఏదో ఒకటి సంకల్పించుకోవాలి. దాని గురించే కృషి చెయ్యాలి. దాన్నే సాధించాలి. అంతేకానీ అసలు ఏమీ చెయ్యకుండా ఇంట్లో కూర్చుని ధ్యానం చేస్తే రెండూ రావు. ఎందుచేతనంటే ధ్యానం చేసిన వాడు బుద్ధుడు అవుతాడు. అది కూడా విశేషంగా ధ్యానంలో బుద్ధుడిలా కృషి చేస్తేనే!

అందుచేత జీవితంలో పరస్పర విరుద్ధమైన సంకల్పాలు ఉండకూడదు. ఎందుకంటే పరస్పర విరుద్ధమైన సంకల్పాలు మన మనస్సులో వుంటే మనం ఏమీ చెయ్యలేం... ఏదీ సాధించలేం. ఎక్కడ వున్న గొంగళీ అక్కడే వున్నట్టుగా వుంటుంది జీవితం! "ఈ నా జీవితం క్రికెట్ ఛాంపియన్ కావడానికే" "ఈ నా జీవితం సినిమా హీరో కావడానికే" "ఈ నా జీవితం డబ్బు సంపాదించడానికే" "ఈ నా జీవితం ఎమ్మెల్యే కావడానికే" "ఈ నా జీవితం కలెక్టర్ కావడానికే" అని ఏదో ఒకటి ధ్యేయంగా పెట్టుకోవాలి. అప్పుడు అది అవుతుంది. అంతేకానీ రెండు మూడు లక్ష్యాలు పెట్టుకుంటే అంతా కలగాపులగమై ఏదీ సాధించలేం.

అందుచేత పరస్పర విరుద్ధమైన సంకల్పాలు ఉండకూడదని తెలుసుకోవాలి.

## సంకల్ప శుద్ధి

ప్రతీ మనిషి తన లక్ష్యాలను నెరవేర్చుకోవాలంటే ముఖ్యంగా "ఏక

సంకల్పం". దానితో పాటు "సంకల్ప శుద్ధి" కూడా అవసరమే!

వరిపైరుతో కలుపు మొక్కలు లేకపోతే అది శుద్ధ పంట అవుతుంది. అలాగే సంకల్పాలలో వికల్పం లేకపోతే అది "శుద్ధ సంకల్పం" అంటారు. వికల్పం ఉంటే సంకల్పం అశుద్ధం అవుతుంది.

అటువంటి వారు కూడా అనుకున్నది సాధించలేరు. అందుచేత వికల్పం లేని "శుద్ధ సంకల్పం" వల్ల మాత్రమే, జీవితంలో అనుకున్నది సాధించగలరు. ఇదే సేత్ మహాశయుడు ఇచ్చిన సందేశం.

## సంకల్ప శక్తి!

ఎక్కడ ఒక సంకల్పానికి రెండు మూడు వికల్పాలు తోడు అవుతాయో... అక్కడ... ఆ సంకల్పానికి శక్తి వుండదు. ఆ సంకల్పం నిర్వీర్యంగా వుంటుంది. అందుచేత సంకల్పానికి శక్తి కావాలంటే "సంకల్ప శుద్ధి" వుండాలి. అంటే వికల్పం ఉండకూడదు. చేసే కృషి ఏక పంథాలో వుండాలి.

అందుచేత ప్రతీ ఒక్కరూ ఈ జీవితంలో ఏం చెయ్యాలి? అన్నది నిర్ణయించుకోవాలి. అటల్ బిహారీ వాజ్‌పేయి ప్రైమ్ మినిస్టర్ అవ్వాలని, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం మంచి సంగీత విద్వాంసుడు కావాలని, టెండూల్కర్ క్రికెట్ ఛాంపియన్ కావాలని... ఏదో ఒక దాని మీద పూర్తి శ్రద్ధ, ఏకాగ్రత కేంద్రీకరించారు. మిగతా వాటన్నిటిని ప్రక్కన పెట్టారు. అనుకున్నది సాధించారు.

ఎందుచేతనంటే మామిడి చెట్టునే తీసుకుందాం. మామిడి చెట్టు మామిడి పూలనే పుష్పిస్తుంది. మామిడి కాయలనే కాస్తుంది. అంతే కానీ మామిడి చెట్టు రకరకాల పూలను పూయదు. రకరకాల కాయలను ఇవ్వదు కదా? కనుక ఒక విత్తనం, ఒక చెట్టు ఒకే రీతిలో వుంటాయి. అలాగే మన జీవితం కూడా ఒక రీతిలో వుండాలి. ఏదో ఒక రీతిని ఎంచుకోవాలి. ఆ రీతికి మన జీవితాన్ని అంకితం చెయ్యాలి.

సితార్ వాయించినా, ఫుట్‌బాల్ ఆడినా, ధ్యానం నేర్పించినా, జీవితమంతా అదే చెయ్యాలి. ఏదో ఒక దానికే మనం అంకితం కావాలి.

అందుచేత సంకల్ప శుద్ధి వుంటేనే సంకల్ప శక్తి వస్తుంది. సంకల్ప శక్తి వుంటేనే సంకల్ప సిద్ధి కలుగుతుంది. అంటే సంకల్పించింది సిద్ధిస్తుంది. అంటే అనుకున్నది సాధిస్తాం.

ఏది ఏమైనా ముఖ్యంగా సంకల్ప శుద్ధి వుండాలన్నా, తద్వారా సంకల్ప శక్తి పెరగాలన్నా ఎవరైనా మనస్సు శుద్ధి చేసుకోవాలి. మనస్సును శూన్యం చేసుకోవాలి. దానికి ఏకైక మార్గం "శ్వాస మీద ధ్యాస" ధ్యానం. అందుచేత ధ్యానం బాగా చెయ్యండి. సంకల్పశక్తిని పెంచుకోండి. అనుకున్న దాని కోసం విశేషమైన కృషి చెయ్యండి. అనుకున్నది సాధించుకోండి.

# సంకల్ప శక్తి!

పత్రీజీ ఇప్పటిదాకా ఎన్నో కాన్సెప్ట్‌లు చెప్పారు. ఎన్నో క్యాసెట్లు రికార్డింగు చేసి ఇచ్చారు. ఇవన్నీ చెప్పటానకీ, ఇవన్నీ చేయటానికీ ఒక సంకల్పం...దృఢ సంకల్పం... ఈ సంకల్పంతోనే అన్నీ చేస్తున్నారు. చేయగలుగుతున్నారు. కానీ మనం సంకల్పాలు చేస్తున్నాం. కొన్ని జరుగుతున్నాయి. కొన్ని జరగటం లేదు. ఎందుకని? కారణం ఏమిటి? అసలు ఈ సంకల్పం అంటే ఏమిటి? వికల్పం అంటే ఏమిటి? ఈ విషయాలు చాలా చాలా ముఖ్యమయినవి.... మన ధ్యానులూ, యోగమిత్రులూ అందరూ విధిగా తెలుసుకోవలసిన ముఖ్యమైన విషయాలు! సంకల్పశక్తి ఆడియో క్యాసెట్‌కు అక్షర రూపమే ఈ ప్రచురణ.

పిరమిడ్ ధ్యాన ప్రపంచానికి ఈ రోజు మనం మరొక చక్కటి అంశం తీసుకొని దానిని విశదపరచుకుందాం!

మై డియర్ మాస్టర్స్! మై డియర్ ఫ్రెండ్స్! అండ్ మై డియర్ గాడ్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్! ఈ రోజు మనం సంకల్పశక్తి అనే విషయం మీద విస్తారంగా తెలుసుకుందాం!

ఈ యొక్క అంశం అన్నది జీవితంలో అత్యంత మౌలికమైన విషయం. మనిషి తన సంకల్పశక్తితోనే సృష్టికర్తగా విరాజిల్లి ఉన్నవాడు. మనిషే కాదు ఏ ప్రాణి అయినా సరే తన సంకల్పశక్తి తోనే కర్తగా, సృష్టికర్తగా విరాజిల్లి ఉంది.

## మనమంతా సృష్టికర్తలం

ప్రతి ప్రాణి కూడానూ ఒకానొక సృష్టికర్త! క్రియేటర్! ప్రస్తుతం నేను ఈ పదాలను సృష్టిస్తున్నాను. ఏవిధంగా? నా యొక్క ధ్యాసను కేంద్రీకృతం చేసి, ఏకీకృతం చేసి, నేను ఈ యొక్క సంకల్పశక్తి అన్న అంశం మీద విస్తారంగా తెలిపేందుకు, ఆ యొక్క సృష్టిని సృష్టించేందుకు, ప్రస్తుతం సృష్టికర్తగా వ్యవహరిస్తున్నాను.

సృష్టి అనేది ధ్యాస తో సృష్టింపబడుతుంది. మరింత ధ్యాసతో ముందుకు తీసుకెళ్ళబడుతుంది. ఆ ధ్యాస అనేది తీసివేసినప్పుడు ఆ యొక్క సృష్టి లయమవుతుంది. 'ధ్యాస ద్వారా సృష్టి! ధ్యాస ద్వారా స్థితి!' ధ్యాసను ఉపసంహారం చేసినప్పుడు అది 'లయం'!

ధ్యాసధార! ప్రతి ప్రాణి యొక్క మౌలికమైన ప్రకృతి ధ్యాసధార! ఆ ధ్యాసధార ఎటువైపు ప్రసరింపబడితే అటువైపు సృష్టి కార్యక్రమం జరుగుతూ

ఉంటుంది. ఆ ధ్యాసధార అన్నది ఎంతసేపు ఉంటే.... ఆ యొక్క దృష్టి కోణంలో...అంతసేపు అక్కడ స్థితి ఉంటుంది. ఎప్పుడైతే ఆ ధ్యాసధార ఉపసంహారం చేయబడుతుందో అంతవరకు అక్కడ సృష్టింపబడిన సృష్టి ఇక 'లయం' చెందుతుంది.

## ధ్యాస ద్వారా సృష్టి

"సృష్టి, స్థితి, లయం!" మిత్రులారా, ధ్యాస ద్వారా సృష్టి! ధ్యాస ద్వారా స్థితి! ధ్యాస ఉపసంహారం ద్వారా లయం! కనుక ఈ రోజు , ఈ యొక్క సంకల్పశక్తి....అంటే ధ్యాసధారను పటిష్టం చేసే విధానం...గురించి విస్తారంగా తెలుసుకుంటున్నాం!

మన జీవితంలో ప్రతీదీ మనకై మనం సృష్టించుకుని మనకు ఇష్టమొచ్చినంతసేపు దాన్ని స్థితిలో ఉంచుకుని, మరి పరిణామ క్రమంలో, మన ఇష్టం తీరినప్పుడు దాన్ని లయం చేస్తుంటాం. మన ధ్యాసధారను ఉపసంహారం చేసుకోవటం ద్వారా!

కనుక ఈ యొక్క సృష్టి, స్థితి, లయల వెనకాతల ఉన్న ఈ యొక్క తెర వెనుక భాగవతమే "ధ్యాస శాస్త్రం".

## ధ్యాస శాస్త్రం

'శ్వాస శాస్త్రమే – ధ్యాస శాస్త్రం!' 'ధ్యాస శాస్త్రమే సృష్టి శాస్త్రం!'

సంగీతం మీద ధ్యాస మనకు ఉంటే ఆ సంగీతం అక్కడ సృష్టించబడుతుంది. ధ్యానం మీద ధ్యాస మనకు ఉంటే ధ్యానం సృష్టించబడుతుంది. ఇల్లు కట్టడం మీద మనకు ధ్యాస ఉంటే ఇల్లు సృష్టింపబడుతుంది. "పెళ్ళి చేసుకోవాలి" అని ధ్యాస మనకు ఉంటే అక్కడ కళ్యాణం సృష్టించబడుతుంది. "పిల్లలు కావాలి" అన్న ధ్యాస మనకు ఉంటే పిల్లలు సృష్టింపబడుతారు. "ఇక వద్దు" అనుకున్నప్పుడు "ఈ జీవితం నాకు వద్దు" అనుకున్నప్పుడు, ఆ ధ్యాసను ఉపసంహారం చేసినప్పుడు, రోడ్డు మీద పోతూ ఉంటే యాక్సిడెంట్ అవుతుంది! చనిపోతాం! "ఎందుకొచ్చిందిరా దేవుడా! ఈ జీవితం బాగోలేదు నాకు! ఈ లోకం నుంచి వెళ్ళిపోతే బావుండు" అని మన ధ్యాసను మార్చుకున్నప్పుడు .... అప్పుడేమవుతుందంటే ....యాక్సిడెంట్స్ అవుతాయి! లేకపోతే శరీరంలో ఏదో ఒక కాన్సర్ వస్తుంది, ఒక లివరు, ప్యాంక్రియాస్...ఏదో ఒకటి...దెబ్బ తింటుంది. దానికి కారణం మన ధ్యాసను ఉపసంహారం చేసుకోవటమే.

జీవితం యొక్క మాధుర్యం పట్ల ధ్యాసను ఉపసంహారం చేసుకున్నప్పుడు జీవితం నిష్క్రమిస్తుంది! దేహ జీవితం నిష్క్రమిస్తుంది! ఎవరైతే, జీవితం యొక్క మాధుర్యం పట్ల వికల్ప రహిత సంకల్ప ధ్యాసధార ను ఉంచుతారో అక్కడ ఆ

జీవితానికి ...... ఆ దేహవత్ జీవితానికి....శరీరవత్ జీవితానికి.....అంతముండదు!

## సంకల్ప శక్తి

ఈ రోజు ఈ యొక్క సంకల్ప శక్తి అన్న ఈ యొక్క అంశం గురించి విస్తారంగా తెలుసుకుంటున్నాం. ఇంగ్లీషు భాషలో దీన్ని Intent. అంటారు. 'సంకల్ప శక్తి' అంటే ది పవర్ ఆఫ్ ఇంటెంట్ అన్నమాట!

Power అంటే శక్తి, సంకల్పమంటే Intent. ది పవర్ ఆఫ్ ఇంటెట్, సంకల్ప శక్తి. మీరు కార్లోస్ కాస్టనెడా పుస్తకాలు చదివితే అక్కడ విశేషంగా చూస్తారు. ఎవరైతే ఇంగ్లీషు వచ్చినా కూడానూ కార్లోస్ కాస్టనెడా పుస్టకాలు చదవరో వారి బ్రతుకులు ముదనష్టపు బ్రతుకులు! ఇంగ్లీషు వచ్చిన ప్రతివాడూ ఆ యొక్క కార్లోస్ కాస్టనెడా పుస్తకాలు చదివి తీరవలె! అక్కడ ఈ ఇంటెంట్......ది పవర్ ఆఫ్ ఇంటెంట్ – అన్నది......దాని యొక్క విశ్వరూపాన్ని సందర్శిస్తారు. దీనినే, పవర్ ఆఫ్ ఇంటెంట్‌నే 'సంకల్పశక్తి' అంటాం.

" ఒక పని చేస్తాం" అనుకున్నప్పుడు వెంటనే రెండు ఆలోచనలు, "ఆ .....! నేనేం చేస్తాను! నా వల్ల అవుతుందేమిటి?' అన్న ఆలోచనలు వస్తాయి. అలాంటి ఆలోచనలను ఏమంటామంటే వికల్పం అంటాం.

'సంకల్పం అంటే పాజిటివ్ థాట్!' 'వికల్పం అంటే నెగటివ్ థాట్!' అంటే నకారాత్మక ఆలోచనలు! "నా వల్ల కాదు" అన్న ఆలోచనలు!

"నా వల్ల అవుతుంది", "నేను చేస్తాను" – అన్న ఆలోచనలనే సంకల్పాలు అంటాం! " ఆ .... నా వల్ల ఏమవుతుందిలే?", " ఈ ప్రపంచం నేను చెప్పినట్లు వింటుందా?", "నా తలరాత ఎలా వుంటే అలా అవుతుంది!", "మానవుడు ఒకటి తలిస్తే దైవం వేరొకటి తలుస్తాడు కదా!''..... ఇలాంటి ఆలోచనలను వికల్పాలు....అంటాం!

## వికల్ప శక్తి

మానవుడు జీవితాన్ని తనకుతానుగా నరకప్రాయం చేసుకుంటున్నాడు, నరక భాజనం చేసుకుంటున్నాడు! తన యొక్క విశేష వికల్పశక్తి ద్వారా సర్వం నిర్వీర్యం చేసుకుంటున్నాడు. తన శరీరాన్ని, జీవితంలోని మధురిమను.....అంతా పోగొట్టుకుంటూన్నడు! జీవితంలోని మకరందాన్ని పోగొట్టుకుంటున్నాడు! జీవితంలో విషాదాన్ని చిలికించుకుంటున్నాడు! తన యొక్క వికల్ప శక్తి ద్వారా! "నిర్వీర్య భావనలే వికల్ప తాండవం!" ప్రతి దానికీ, అడుగు, అడుగునా, " ఆ ....! నా వల్ల ఏమవుతుందిలే!" " నా మాట ఎవరు వింటారులే?" "నేను నీచుడిని కదా!", "అల్పుడిని కదా!" , "ఎందుకూ పనికిరాని వాణ్ణి కదా!"......చూశారా! ది ట్రెమండస్

ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్!

మై డియర్ ఫ్రెండ్స్! ఈ యొక్క మానవ జీవితం దుర్భరం కావటానికీ, రోగగ్రస్తం కావటానికీ, విషాదపూరితం కావటానికీ కారణం మన యొక్క విస్తారమైన వికల్పతాండవమే! మన దౌర్భాగ్యాన్నీ, మన దరిద్రాన్నీ, మనవేం సృష్టించుకుంటూన్నాం! దానికి సృష్టికర్తలం మనమే. We create our own reality....all the time...not 'some' of the time !All the time! In all the situations! Not in 'some' situations! మన వాస్తవికతను మనమే సృష్టించుకుంటూన్నాం..... అన్ని సమయాలలోనూ.....అన్ని పరిస్థితులలోనూ, మనం అనుభవిస్తున్నదంతా మనం సృష్టించుకున్నదే! ఏది మనం మనకై సృష్టించుకోమో అది మనం అనుభవించం! ఈ యొక్క సృష్టి అంటే క్రియేటివిటీ, ఇది మన ధ్యాస లోంచి,.....మన సంకల్పం లోంచి ఉద్భవిస్తుంది!...

ఇప్పుడు ఈ క్షణంలో, నా ధ్యాస అంతా అందరికీ ధ్యాస గురించి చెప్పాలని! కనుక చెప్తున్నాను. చూసారా! ఇది సృష్టించబడుతుంది ఇప్పుడు, ఈ క్షణంలో, ఈ సృష్టి కార్యక్రమం జరుగుతుంది! ఆ విధంగా నేను దానికి నిశ్చయించుకున్నాను. కనుక ! ఆ నిర్ణయం నేను తీసుకున్నాను.

ఈ నిర్ణయం నేను తీసుకుని ఉండకపోతే ఈ మాటలు ప్రస్తుతం రికార్డు అయ్యేవా? ఈ రికార్డు అవుతున్న మాటలు మీరు మటుకు వింటూండేవారా? ఏదీ జరుగదు! ప్రతీది అంతే!

నాకు వంకాయకూర అంటే ఇష్టం. నేను బజారుకెళ్ళి వంకాయలు కొనుక్కుంటాను; ఇంటికి వచ్చి కడుక్కుంటాను; తరుక్కుంటాను; చక్కగా వండుకుంటాను; తింటాను. నేను వండుకున్నదే నాకు లభిస్తుంది. "పక్కింటికెళ్ళి తినాలి" అని అనుకుంటాను. వాళ్ళింటికి వెళతాను; వాళ్ళింట్లో ఏది ఉంటే అది నేను తింటాను. కనుక, ఆ పక్కింటి కెళ్ళడం అనేది, "పక్కింటికి వెళ్ళాలి" అన్న ఆ యొక్క థాట్ మీద ఆధారపడి వుంటుంది.

## వింత కలయిక!

మనిషి సంకల్పం, అథవా వికల్పం...ఈ రెంటి వింత కలయిక! వింత సమ్మేళనం! ఒక అడుగు ముందుకు, రెండు అడుగులు వెనుకకు వేసేట్టు....ఒక సంకల్పానికి రెండు వికల్పాలు జోడు అయి....ప్రతి మనిషి చిన్నాభిన్నమై, అస్తవ్యస్తమై, శోక సహితమై, "జీవితమే దుర్భరం" అన్న నిర్వచనానికి తీసుకొచ్చేట్లు చేస్తుంది!

జీవితం దుర్భరం కాదు! మానవుని యొక్క ధ్యాస దుర్భరంగా ఉంది! జీవితం ధ్యాసకు దర్పణం. మన ధ్యాస ఎలాంటిదిగా వుంటుందో, మన జీవితం

అలాంటిదిగా ఉంటుంది. మన యొక్క ధ్యాస సరికానిదైతే మన జీవితం సరికానిది. మన ధ్యాస సరియైనది అయితే మన జీవితం సరియైనది. జీవితం అన్నది ధ్యాస యొక్క దర్పణం; ప్రతి రూపం! "ఎలాంటి జీవితం నాకుంటుంది?" అంటే ఎలాంటి ధ్యాస నా లోపల వుంది?"......చూసారా!

## నా దగ్గర సత్తా వుంది

ఉదాహరణకు అటల్ బిహారీ వాజ్‌పేయ్ గారినే తీసుకుందాం. 30 సంవత్సరాల క్రిందట. 40 సంవత్సరాల క్రిందట, ఆయన మాట్లాడినప్పుడు "అరే! ఇతనే ప్రైమ్ మినిస్టర్ అవుతాడు! ఏదో ఒకరోజు భారతదేశానికి!" అనిపించింది. అందరికీ అనిపించింది. నాకు ఒక్కడికే కాదు! ఎందుకంటే అతనికి కూడానూ, "నేను ప్రైమ్ మినిస్టర్‌ని కావాలి! నా దగ్గర అంత సత్తా వుంది! ఈ భారతదేశానికి నేను ప్రైమ్ మినిస్టర్‌ని కావాలి!" అనిపించింది! అఖండమైన సంకల్పశక్తి ఉన్నది ఆయన దగ్గర! అయ్యాడు! ఆ రోజుల్లో ఆయన ఒక్కడే బి.జె.పి. తరపున మెంబర్ ఆఫ్ పార్లమెంట్, మరి అటువంటి వ్యక్తి భారతదేశానికి ప్రైమ్ మినిస్టర్ అయ్యాడు కదా? ఎలా అయ్యాడు? పెద్ద మేరు పర్వతం లాంటి కాంగ్రెస్ పార్టీని ఢీకొన్నాడు! ఇదేమైనా సామాన్యమైన విషయమా? ఎంతటి అచంచలమైన సంకల్పశక్తి....వికల్పరహితమైన సంకల్పశక్తి...! కనుకనే ప్రధానమంత్రి అయ్యాడు భారతదేశానికి!

## క్విట్ ఇండియా

మై డియర్ ఫ్రెండ్స్ ! మై డియర్ మాస్టర్స్! మై డియర్ గాడ్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్! గాంధీజీ గారికి ఎంతటి సంకల్పశక్తి ఉంది! మరి బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ....రవి అస్తమించని ఆ యొక్క సామ్రాజ్యాన్ని ....అస్తమింపచేసాడు! ఎంతటి సంకల్పశక్తి! "క్విట్ ఇండియా! భారతదేశాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోండి!" అంటే వెళ్ళిపోయారు! తప్ప లేదు! అంటే ఎంతటి అఖండమైన సంకల్ప శక్తి....వికల్ప రహితమైన సంకల్పశక్తి....! చూశారా? " నా ప్రాణాలు పోవుగాక! నువ్వు మటుకు వెళ్ళు గాక! నా ప్రాణాలకు నేను చింతించడం లేదు! "నువ్వు ఇక్కడున్నావే' అని చింతిస్తున్నాను," అన్నాడు! చూశారా!

## స్త్రీ శక్తి

మదర్ థెరిస్సాకి ఎంతటి సంకల్పశక్తి ఉందో! దీన జనోద్ధరణకు ఏ విధంగా నడుం బిగించింది! ఒక స్త్రీ ఎలా నడుం బిగించింది! మరి ఎంతటి సంకల్పశక్తి ఉంది!

మేడమ్ క్యూరీ ఆ యొక్క ఒక కొత్త ఎలిమెంట్ రసాయనం లోంచి ఒక

యురేనియం అన్నది ఉంది, " ఏదో కొత్తది ఉంది . నేను దాన్ని వెలికి తీయాలి" అని చెప్పేసి జీవితమంతా ప్రయోగాలు చేసి...ప్రాణాలను ఫణంగా పెట్టి..... కనుక్కొంది మేడమ్ క్యూరీ! ఎంతటి సంకల్పశక్తో!

## కొలంబస్

కొలంబస్ మరి ఒక చిన్న పడవ మీద అట్లాంటిక్ మహాసముద్రాన్ని లంఘించాడు! అమెరికాను దర్శించాడు! ఎంతటి సంకల్పశక్తో! ఏ మాత్రం అయినా ఒక్క వికల్పం వచ్చి వుంటే 'బుడుంగు' మని! ఆ పడవ మునిగిపోయి వుండేది!

కొందరి జీవితాలే అస్తవ్యస్తంగానూ, మరి కొందరి జీవితాలే సఫలంగానూ, విజయ – వంతంగానూ ఎందుకున్నాయి? ఒకరి జీవితం అశాంతిమయంగా, ఇంకొకరి జీవితం శాంతిమయంగా ఎందుకుంది?

వారి వారి ధ్యాసలకు అనుగుణంగా వారి వారి జీవితాలు! ధ్యాసను మారిస్తే జీవిత దిశ మారుతుంది! దశ మారుతుంది! ధ్యాస దిశను, ధ్యాస దశను మార్చాలి! ధ్యాస దిశ సత్యవంతంగా వుండాలి! ధ్యాస దశ మరి పటిష్టంగా ఉండాలి!

## పరస్పర విరుద్ధ సంకల్పాలు

ఎవరైతే పరస్పరం విరుద్ధమైన సంకల్పాలు చేస్తారో..మళ్ళీ జీవితం అస్తవ్యస్తం అవుతుంది! "నేను ప్రైమ్ మినిస్టర్‌ను కావాలి", "నేను బుద్ధుడిగా కూడా కావాలి"...రెండూ పరస్పరం విరుద్ధం. ఎలా కుదురుతాయి రెండూ? నువ్వు ప్రైమ్ మినిస్టర్ అయితే బుద్ధుడి గురించి ఆలోచించడం మరచిపోవాలి. బుద్ధుడిగా కావాలంటే ప్రైమ్ మినిస్టర్‌గా ఆలోచించడం మరచిపోవాలి. రెండూ పరస్పరం విరుద్ధం.

కనుక జీవితంలో పరస్పర విరుద్ధమైన సంకల్పాలు ఉండరాదు! ఎప్పుడైతే పరస్పర విరుద్ధమైన సంకల్పాలు మన మనస్సులో వుంటాయో, ఏమీ చెయ్యలేం! జీవితం ఎక్కడున్న గొంగళి అక్కడే వుంటుంది! "ఈ నా జీవితం సంగీతానికే!" ఈ నా జీవితం పాలిటిక్స్‌కే!" "ఈ నా జీవితం బుద్ధత్వానికే!" " ఈ నా జీవితం పైసలు సంపాదించేందుకే!" ...ఏదో ఒకటి ధ్యేయంగా పెట్టుకోవాలి. అప్పుడు అది అవుతుంది. రెండు మూడు పెట్టుకుంటే, అంతా కలగాపులగమై ఏదీ సాధించం! ఎన్నో జీవితాలున్నాయి! తొందరేల? ఒక్కొక్క జీవితం ఒక్కొక్క దానికి అంకితం చేయవలె! దీనిని 'సంకల్ప శుద్ధి' అంటారు. చూశారా!

ప్రతి మానవుడికి అన్నీ కావాలి! పెళ్ళాం కావాలి! పెళ్ళాం వద్దు! సన్యాసం

కావాలి! సంసారం కావాలి! పేరు ప్రతిష్టలు కావాలి! మళ్ళీ దుఃఖ రాహిత్యమూ కావాలి!

## అన్నీ వస్తాయి!

పేరు ప్రతిష్ఠలు కావాలంటే, దుఃఖ రాహిత్యం ఎలా వస్తుంది? కానీ అన్నీ వస్తాయి! దానికీ మార్గముంది. అయితే వాడు అఖండమైనే ధ్యానయోగి అయి వుండాలి! అఖండమైన జ్ఞానయోగి అయి వుండాలి! అప్పుడు అన్నీ సంకల్పాలే ఉంటాయి! అప్పుడు పరస్పరం విరుద్ధాలైన సంకల్పాలే లేవు! కానీ ఎక్కడైతే ధ్యానం, జ్ఞానం, ఆధ్యాత్మికత అన్నవి ఐక్యమవుతాయో, ఐక్యమై వున్నాయో..అక్కడ ఏక సంకల్పం, ఏక దిశ ఉండవలె! దీనినే సంకల్పశుద్ధి అంటాం! "సంకల్ప శుద్ది ద్వారానే సంకల్ప సిద్ధి"! చూశారా!

ఉదాహరణకు నా పేరు సుభాష్ పత్రి. నేను ఏ సంకల్పం పెట్టుకున్నాను? "ఈ ఆంధ్రరాష్ట్రం ధ్యానాంధ్రప్రదేశ్ కావాలి 2004 కల్లా!" ....ధ్యాన భారతం కావాలి 2008 కల్లా!"....."ధ్యాన జగత్తు కావాలి 2012 కల్లా!"

నాకు నా పెళ్ళాం ఏమైనా ఫర్వాలేదు. నా కూతుళ్ళు ఇద్దరూ చచ్చిపోయినా పర్వాలేదు! ఈరికార్డింగ్ చేస్తున్న సంజయ్ ఏమైనా ఫర్వాలేదు. నాకు ఒక సంజయ్ పోతే ఇంకో పదిమంది సంజయ్‌లు వస్తారు. ఎవరేమయినా కాని, నా యొక్క లక్ష్యం మీదే దృష్టి. ఇంకోటేది నాకు ఆనదు! అంటే "ఇంకేదైనా ఫర్వాలేదు. నాకు ఇదొక్కటే కావాలి" అన్నప్పుడు చూశారా......అవుతుంది. దీనినే "సంకల్పశుద్ధి" అంటాం!

## సంకల్పశుద్ధి

ప్రతి మనిషీ కూడానూ తన లక్ష్యాలను తాను నెరవేర్చుకోవాలంటే "సంకల్ప శుద్ధి" తప్పనిసరి! "జీవితం ఒక్కటే" అనుకున్నప్పుడు వాడికి అన్నీ కావాలి. మరి దానితో పరస్పరం విరుద్ధాలైన అనేక సంకల్పాలతో ఏదీ చేయకుండా నిశ్చేష్టుడై ఉన్నాడు సగటు మానవుడు. కానీ ఆధ్యాత్మికతను సంతరించుకున్న మానవుడు "అనేక జన్మలు వున్నాయి" అనీ, "తాను శాశ్వతంగా ఉండే ప్రాణి" అనీ తెలుసుకుని ఉన్న సమయంలో, ఉన్న శరీరంలో , ఏక సంకల్పాన్ని ప్రతిష్టించుకుని అఖండమైన సంకల్పశుద్ధి తో తన సంకల్పాన్ని విజయపథం వైపు నడిపించిచితే....అప్పుడు మిగతా కోరికలన్నీ, మిగతా సంకల్పాలన్నీ తమకు తామే నెరవేరుతాయి.

మై డియర్ ఫ్రెండ్స్! మై డియర్ మాస్టర్స్! మై డియర్ గాడ్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్! ఈ రోజు మనం విస్తారంగా సంకల్ప శక్తి అన్న అంశం గురించి తెలుసుకుంటున్నాం.

సంకల్పాల పసిడి పైరులలో! 'వికల్పాలు' అనే కలుపు మొక్కలు లేకపోవడం..! అన్నది 'సంకల్ప శుద్ధి!' వికల్పంలో కూడుకుని ఉంటే 'సంకల్ప

అశుద్ధి!' అశుద్ధం! అది జీవితమును అస్తవ్యస్తం చేస్తుంది. శుద్ధ సంకల్పం జీవితాన్ని సరియైన పంథాలో, కోరుకున్న పంథాలో నడిపిస్తుంది.

## సంకల్ప శుద్ధి ద్వారా సంకల్పశక్తి!

ఎక్కడ ఒక సంకల్పానికి రెండు మూడు వికల్పాలు జోడు అవుతాయో..అక్కడ...ఆ సంకల్పానికి శక్తి వుండదు! నిర్వీర్యంగా అది వుంటుంది. సంకల్పానికి శక్తి కావాలంటే సంకల్పశుద్ధి ఉండవలె! అంటే వికల్పాలు వుండరాదు. జీవితాన్ని ఏక పంథాలో నడిపించాలి.

మంగళంపల్లి బాలమురళీకృష్ణకు సంగీతం తప్ప వేరే అక్కర్లేదు. బిస్మిల్లాఖాన్‌కు, పండిత జసరాజ్‌కు, శెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్‌కు....వీరందరికి సంగీతం తప్పితే వేరే అక్కర్లేదు. సంగీతం సాధించుకున్నారు. సంగీతం ద్వారా సకల ప్రపంచాన్ని జయించారు. సకల ప్రపంచం వారి పాదాలకు మోకరిల్లింది. చూశారా! ఉదాహరణకు టెండూల్కర్‌ను తీసుకుందాం ఆయన తన ధ్యాస ధారతో ప్రపంచంలో మేటి క్రికెటర్ అయ్యాడు. ప్రపంచమంతా అతనికి దాసోహం అయ్యింది. చూశారా! మిగతా కోరికలన్నీ ఒకే ఒక కోరిక ద్వారా తీర్చేసుకున్నాడు. డబ్బు కావాలి- క్రికెట్ ద్వారా డబ్బు వచ్చింది. చూశారా! సంఘంలో గౌరవం కావాలి- క్రికెట్ ద్వారా సంఘంలో గౌరవం వచ్చింది. అంటే తాను క్రికెట్‌కు అంకితం అయినప్పుడు తాను కోరుకున్న మిగతావన్నీ కూడానూ అతని ఒళ్ళోకి వచ్చి పడ్డాయి చూశారా! డబ్బు కావాల, పేరు ప్రతిష్టలు కావాల, సంఘంలో గౌరవం కావాల, పేరు ప్రతిష్టలు కావాల, సంఘంలో గౌరవం కావాలని ఎవరికి వుండదు! అందరికీ వుంటుంది. కాని అతను టెండూల్కర్ – సచిన్ టెండూల్కర్ వాటన్నింటినీ ప్రక్కన పెట్టి క్రికెట్ మీద ధ్యాసను ఉంచాడు. బంతిని బ్యాట్‌తో కొట్టడం మీద తన ధ్యాసను కేంద్రీకృతం చేశాడు. అతనికి కావాల్సింది అదే. ప్రతి బాల్‌ను నేను బ్యాట్‌తో ఎలా కొట్టాలి? వికెట్ పోకుండా ఎలా సంరక్షించుకోవాలి? అన్న దాని మీద కేంద్రీకృతం చేశాడు- తన ధ్యాసను కేంద్రీకృతం చేశాడు. తన ధ్యాస ధారను వికల్ప రహితంగా, సంకల్ప సహితంగా, మరి ప్రపంచంలో మేటి క్రికెటర్ అయ్యాడు. బ్యాట్స్‌మెన్ అయ్యాడు. కెప్టెన్ అయ్యాడు. ఎన్ని వేల సెంచరీలు చేశాడో.....ఎన్ని వేల రన్స్ కొట్టాడో.చూశారా!

## ప్రపంచాన్ని జయించారు!

బిస్మిల్లాఖాన్ స్వరాల మీద, టెండూల్కర్....మరి ఆ యొక్క క్రికెట్ మీద ధ్యాస పెట్టి ప్రపంచాన్ని జయించారు. అటల్ బిహారీ వాజ్‌పేయి పాలిటిక్స్ మీద పెట్టి ప్రపంచాన్ని జయించారు. ఏదో ఒక వస్తువు మీద పూర్తి శ్రద్ధను, ఏకాగ్రతను, కేంద్రీకృతం చేస్తే, మిగతా వాటన్నింటినీ పక్కకు పెట్టేసి, అప్పుడు ఈ ఒక్కటి

పూర్తిగా ఫలించినప్పుడు తద్వారా మిగతావన్నీ వచ్చి పడతాయి. మై డియర్ ఫ్రెండ్స్, ప్రతి మనిషి కూడానూ నిర్ణయించుకోవాలి; నేను ఈ జీవితంలో ఏమి చేయాలి?"

ఉదాహరణకు ఒక వేప చెట్టు వుందనుకుందాం! వేప చెట్టు వేప పూలనే పుష్పిస్తుంది, వేప పళ్ళనే ఫలిస్తుంది. రకరకాల పువ్వులు, రకరకాల పళ్ళూ ఒకే చెట్టు మీద వస్తాయా ఏంటి? రావు! కనుక, ఒక విత్తనం, ఒక చెట్టు ఒక రీతిలోనే వుంటాయి! మన జీవితం కూడా ఒకే రీతిలో ఉండాలి! ఏదో ఒక రీతిని ఎంచుకుని ఆ రీతికి మన జీవితాన్ని అంకితం చేయాలి!

సితారు వాయిస్తాం; జీవితమంతా సితారే! తబలా వాయిస్తాం ; జీవితమంతా తబలాయే! ఫుట్‌బాల్ ఆడతాం. జీవితమంతా ఫుట్‌బాలే! ధ్యానం నేర్పిస్తాం; జీవితమంతా ధ్యానం నేర్పించాలి! దానికి మనం అంకితం. పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ మాస్టర్లు ధ్యానం చెయ్యడానికి కాదు, ధ్యానం చేయించడానికి అంకితమైన వారు. అనేక జన్మలలో ఎంతో ధ్యానానికి అంకితమై, ఈ జన్మలో ధ్యాన ప్రచారానికి అంకితం చేసుకుని పుట్టినవారు. మరి ఆ సంకల్పంతో పుట్టినవారు! గుర్తుంచుకోండి ప్రతి ప్రాణి కూడానూ, ప్రతి మానవుడు కూడానూ, పుట్టే ముందర అఖండమైన సంకల్పశుద్ధి వుంటుంది. ఇక్కడకు వచ్చిన తర్వాత మళ్ళీ అంతా అయిపోతుంది. పుట్టకముందు అందరికీ నూటికి నూరు శాతం సరైన సంకల్పశుద్ధి ఉంటుంది.

'నేను ఈ జన్మలోనైనా ఈ పని చేయాలి' అని పుడతాడు. వచ్చిన తరువాత పక్కవాణ్ని చూసి .....వీణ్ణి చూసి.....ఆ ఇంటి వాణ్ణి చూసి...... ఈ ఇంటి వాణ్ణి చూసి......అరే! నా కన్నా వారిదే బాగుందే! నా కన్నా వీరిదే బాగుందే! వారికి A.C. కారుందే! ఓయబ్బా! చూశారా! ఇక్కడకొచ్చి అంతా గందరగోళం! పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్లు; నక్కను చూసి పులి తన వాతలు తీసేసినట్లు....అలా తయారవుతుంది జీవితం.

## పూర్తి అవగాహన!

మై డియర్ ఫ్రెండ్స్! మనిషికి ఈ యొక్క సంకల్పశక్తి ద్వారా సంకల్పసిద్ధి చేకూరాలంటే సంకల్పశుద్ధి ఉండాలి! సంకల్పశుద్ధి అంటే "నేను ఏం చేయాలి ఈ వర్తమాన జీవితంలో?" అనే పూర్తి అవగాహన! ఉదాహరణకు కర్ణుడు ఉన్నాడు అతనికి మిత్రత్వమే కావాలి; దానమే కావాలి; మిత్రత్వానికి ప్రాణాన్ని అర్పించాడు; దానానికి అన్నీ అర్పించాడు; అందుకే మరి దాన కర్ణుడు అయ్యాడు. మిత్రత్వానికి ప్రతీక అయ్యాడు.

భీష్ముడు తన ప్రతిజ్ఞకు ప్రతీక అయ్యాడు. శ్రీరాముడు పితృవాక్య పరిపాలనకు ప్రతీక అయ్యాడు. సీత మరి పతివ్రతా తత్త్వానికి ప్రతీక అయ్యింది.

బిస్మిల్లాఖాన్ షహనాయ్‌కి ప్రతీక అయ్యాడు.

మహాత్మాగాంధీజీ అహింసా సిద్ధాంతానికి ప్రతీక అయ్యాడు. మదర్ థెరిస్సా మానవసేవకు ప్రతీక అయ్యింది. మరి మనం ఏమయ్యాం? దేనికి ప్రతీక అయ్యాం? ప్రొద్దున్నే ఇడ్లీ, వడ, సాంబార్ తినడానికి; మధ్యాహ్నం వెజిటబుల్ పలావ్ తినడానికి! ఆ తరువాత సాయంత్రం మళ్ళీ దాబాకు పోయి ఏం తిందాం? మరి తినడానికి, త్రాగడానికి ప్రతీక. శుద్ధ పశు జీవితం.

## ఒక్కొక్క కళ, ఒక్కొక్క విద్య!

మై డియర్ ఫ్రెండ్స్ ! అందరం సకలకళాకోవిదులం కావాలి! సకల విద్యా పారంగతులం కావాలి! ఒక్కొక్క జీవితం ఒక్కొక్క కళకు , ఒక్కొక్క విద్యకు అంకితం. మానవ జీవిత పరంపర అన్నది సకల విద్యాపారంగతులు కావడం కోసం! సకల కళా కోవిదులు కావడం కోసం! ప్రతి జీవితం కూడానూ ఎంచుకున్న జీవితం సఫలీకృతం కావడానికి! దానికి సంకల్ప శక్తి, సిద్ధి ఉండాలి! సంకల్పశుద్ధి ఉంటేనే సంకల్పశక్తి వస్తుంది! సంకల్ప శక్తి వుంటేనే సంకల్పసిద్ధి అవుతుంది! మై డియర్ ఫ్రెండ్స్! మై డియర్ మాస్టర్స్! మై డియర్ గాడ్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్!

చిన్నప్పటి నుండి పిల్లలకు సంకల్పశక్తిని, సంకల్పశుద్ధిని, సంకల్పసిద్ధిని,.... ఈ సంకల్ప శాస్త్రాన్ని బోధించాలి! ఈ ధ్యాస శాస్త్రాన్ని బోధించాలి.! పిల్లలను ఇంటెంట్ బాల్స్‌గా, సంకల్పానికి ప్రతిమూర్తులుగా తీర్చిదిద్దవలె! మై డియర్ ఫ్రెండ్స్!" ఇదంతా ఎలా సంభవం?" అంటే ఈ యొక్క ధ్యాస శాస్త్రం.... ఈ యొక్క ఆలోచనా తరంగాల శాస్త్రం.... దీనిని అధ్యయనం చేయించాలి.

## సకారాత్మక ఆలోచనలు

మన మనస్సులో సకారాత్మక ఆలోచనా తరంగాలు ఎప్పుడూ సుప్రతిష్ఠమై ఉండాలి! మనస్సులో ఏవో ఒక రీతి తరంగాలు ఎప్పుడూ వుంటాయి. ఎలాంటి ఆలోచనా తరంగాలుండాలి?.... ఎప్పుడూ సకారాత్మక ఆలోచనా తరంగాలు వుండాలి! నకారాత్మక ఆలోచనా తరంగాలు ఉండరాదు.

ఇవన్నీ సాధించాలంటే మరి ధ్యానం తప్పనిసరి! మనస్సును ఎంత శూన్యంగా ఉంచుకుంటే మనస్సు యొక్క శక్తి అంత ఉధృతం అవుతుంది! మనస్సును ఎంత పరిశూన్యంగా ఉంచుకుంటే అంత ప్రచండంగా వుంటుంది!

మొదటిది మౌనం; రెండవది ధ్యానం; ఇంక మూడవది ఈ యొక్క సంకల్పశాస్త్రం! ఈ మూడూ కూడా పరంపరగా సంకల్పాలకు శక్తిని సమకూర్చేవి!

ఇతోధికంగా మౌనం ఉండాలి! అవసరం అయితేనే మాట్లాడాలి! అవసరం లేని మాటలు బొత్తిగా ఉండకూడదు.. తరువాత అనవసరమైన ఆలోచనలు ఉండకూడదు. అవసరమైన ఆలోచనలే ఉండాలి. లేనప్పుడు ఆలోచనా రహిత

స్థితిలో, ధ్యానంలో విరాజిల్లాలి.

మొట్టమొదటిది మౌనం, రెండవది ధ్యానం, మూడవది ఈ సంకల్ప శాస్త్రం, ఈ థాట్ సైన్స్! ఈ యొక్క సంకల్పశాస్త్రంను విశేషంగా పరిచయం చేసుకోవాలి! అధ్యయనం చేయాలి! కనుక ఈ యొక్క సంకల్ప శాస్త్రజ్ఞానం, మరి ధ్యానం, మరి మౌనం ఈ మూడూ కూడా సంకల్పాలకు శక్తిని సమకూర్చేవి.

## నో మెంటల్ డయారియా!

మరొక్కసారి చెప్పుకుందాం. మై డియర్ ఫ్రెండ్స్! మౌనం అంటే నోటి దూల లేకపోవడం! There should be no verbal diarrhoea! దట్ ఈజ్ మౌనం! పది వాక్యాలలో చెప్పవలసింది.... ఒక పదంలో చెప్పాలి! తరువాత మెంటల్ డయారియా ఉండకూడదు; థాట్ డయారియా ఉండకూడదు. ప్రొద్దుగూకులూ దాని గురించి ఆలోచించీ, దీని గురించి ఆలోచించీ, ....“నేను ఇలా చేస్తే వాడిలా అంటాడు!” వాడలా చేస్తే నేనెలా చెయ్యాలి?” .....ఇదంతా కూడానూ మెంటల్ డయారియా! అది ఉండకూడదు! తర్వాత ఈ యొక్క ధ్యానశాస్త్రం, మౌన శాస్త్రం ఎలా ఉన్నాయో.....అదే విధంగా సంకల్పశాస్త్రం, ధ్యాస శాస్త్రం! వీటిని అధ్యయనం చేయాలి!

## రామ్తా

ఎన్నో అద్భుత పుస్తకాలు వున్నాయి. ఉదాహరణకు రామ్తా అన్న పుస్తకం తప్పక చదవాలి. ఈ యొక్క “ధ్యాస శాస్త్రం” యొక్క ప్రచండమైన రూపం రామ్తా అనే పుస్తకం! తెలుగులో అనువదింపబడింది! పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ మాస్టర్లు రామ్తా అన్న పుస్తకాన్ని ధ్యాస శాస్త్ర విజ్ఞానంగా, విజ్ఞాన భాండాగారం’ గా, ధ్యాస శాస్త్రాన్ని ఈ యొక్క సంకల్పశాస్త్రాన్ని పిండి చేసి భోంచేసి జీర్ణించుకున్నవారు!

## సంకల్పశక్తికి అవధులు లేవు!

సంకల్పాలను పరిశుద్ధం చేసుకున్నవారే, పిరమిడ్ మాస్టర్లు! విశేషమైన ప్రచండమైన ధ్యానం ద్వారా పరిశుద్ధ ఆత్మలై ఈ యొక్క ధ్యాస శాస్త్రంను ధ్యాస శాస్త్రజ్ఞులుగా, మరి సమాజంలో కళ్యాణాన్ని ఆవిష్కరించడానికి నడుం బిగించినవారు. “స్వకళ్యాణం ధ్యానం ద్వారా, లోక కళ్యాణం సంకల్పశక్తి ద్వారా!” నా స్వంత కళ్యాణానికి మరి నా ధ్యానం, మరి లోక కళ్యాణానికి నా యొక్క అఖండమైన సంకల్పం! మానవుని సంకల్పశక్తికి అవధులు లేవు. ఏది కావాలంటే అది పొందగలరు. పొంది తీరాలి! ప్రతి కోరికనూ సాకారం చేసుకునేందుకే ప్రతి జీవితం! కోటానుకోట్ల కోరికలను సాకారం చేసుకునేందుకు కోటానుకోట్ల జీవితాలు! అనంత జీవన ప్రవంతి. సాధన-ధ్యాన సాధన. సంకల్ప శాస్త్ర అధ్యయనం, సంకల్ప సాధన, ఇవన్నీ కూడా వెరసే మానవుడి కళ్యాణినికి; లోక కళ్యాణానికి,

ఏదైతే మానవ కళ్యాణానికి మార్గమో అదే లోక కళ్యాణం . లోకం మానవులతో కూడుకున్న సమూహం!

## ఎప్పుడూ ప్రోత్సాహం ఇవ్వవలె!

చిన్న పిల్లలకు "నువ్వు అది చెయ్యలేవురా" అనే మాట ఎప్పుడూ వినిపించకూడదు. అలాంటి మాటలు పెద్దల నుంచి ఎప్పుడూ రాకూడదు. ఎప్పుడూ ప్రోత్సాహం ఇవ్వవలె! నిరుత్సాహం ఉండరాదు, నిరుత్సాహపరచరాదు, ప్రోత్సాహపరచవలె! Motivation, not demotivation. ప్రోత్సాహం ఎప్పుడూ అలా పంచుతూ ఉండాలి! నిరుత్సాహం ఎప్పుడూ ఆ యొక్క ఊసే ఉండరాదు. ఆ యొక్క పలుకు ఉండరాదు. ఆ యొక్క ఆలోచన ఉండరాదు. ఏమైనా చెయ్యగలవు. అన్నమాటే సరి అయిన మాట! ఏమైనా చేయగలను అన్న ఆలోచన సరియైన ఆలోచన! నీ ఆలోచన నిన్ను పటిష్టం చేస్తుంది! నీ మాట నిన్ను , మరి లోకాన్ని పటిష్టం చేస్తుంది. నీ ఆలోచన పక్కవాడికి చేరదు. నీ మాట ప్రపంచానికి చేరుతుంది పలికిన వెంటనే!

## మౌనం - ధ్యానం

మై డియర్ ఫ్రెండ్స్! ధ్యాస అంటే మన మనస్సులో ఆ యొక్క ఆలోచనలను శుద్ధంగా ఉంచుకొనవలె! పటిష్టం చేయవలె! "ధ్యాన శక్తి ద్వారానే సంకల్ప శక్తి" . ఎంత ధ్యానంలో మనం ఉంటామో అంత సంకల్పశక్తి సమకూరుతుంది! ఎంత మౌనంగా ఉంటామో అంత సంకల్పశక్తి సమకూరుతుంది! ఎంతగా ఈ యొక్క ధ్యాన శాస్త్రాన్ని అవగతం చేసుకుని ఉన్నామో అంతగా మన సంకల్ప శక్తి సమకూరుతుంది. ఈ మూడు విధానాలు మౌనం, ధ్యానం, జ్ఞానం ద్వారా సంకల్పం యొక్క శక్తి..ఎక్కడ మౌనం లేదో.....ఎక్కడ ధ్యానం లేదో....ఎక్కడ జ్ఞానం లేదో....సంకల్పంలో ఒక సంకల్పానికి దొంతరగా వికల్పాలు ఉంటాయి. మానవ జీవితం అస్తవ్యస్తంగా తయారవుతుంది. మానవుడి ధ్యాస జీవితంలో సంకల్పాల దొంతరే ఉండాలి! కానీ వికల్పం అనే ఆ యొక్క కలుపు మొక్క ఉండరాదు. వికల్పం అన్నది మానవుని జీవితంలో ఉన్న కలుపు మొక్క. ఆ కలుపు మొక్క తీసి వేయబడవలె. పంట పరిశుద్ధంగా ఉండవలె!

## కల్పన

మై డియర్ ఫ్రెండ్స్! పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ మాస్టర్స్ అందరూ ఈ రోజు ఈ యొక్క సంకల్పశక్తి, సంకల్పశుద్ధి, సంకల్పసిద్ధి గురించి ఇంకా తెలుసుకుంటున్నాం. "వికల్పం ఉంటే వికల్పసిద్ధి అవుతుంది!" "సంకల్పం ఉంటే సంకల్ప సిద్ధి అవుతుంది!" నేను చేయలేను అన్న ఆలోచన ఉంటే, నువ్వు

చేయలేకపోవడం నీకు నువ్వు అపజయం పొందడం, అదే సిద్ధిస్తుంది. వికల్పముంటే వికల్పం సిద్ధిస్తుంది. సంకల్పముంటే సంకల్పం సిద్ధిస్తుంది. కనుక 'కల్ప' ; 'కల్పన'; తయారు చేసేది సృష్టి, సృష్టికర్త అంటే సృష్టిసంకల్పం చేస్తున్నవాడు. 'కల్పన' ....చూశారా! "సంకల్పంలో కానీ, వికల్పంలో కానీ కల్పన అన్న పదం ఉంది!"

కల్పన అంటే imagination.సృష్టించే పదార్థం, కల్పన. "నేను చేతకాని వాణ్ణి" అన్న ఆలోచన ఉంటే మన చేతగాని తనమే సృష్టించబడుతుంది! నేను చేతకానివాడిని! చేతకానివాడిని!" అనుకుంటూ వుంటే ఏ పని తలపెట్టినా అందులో మనం అసఫలులం అవుతాం. అంటే మన వికల్పం అక్కడ సిద్ధించింది! వికల్పం ఉంటే వికల్పం సిద్ధిస్తుంది. అపజయం ఉందంటే అక్కడ వికల్పమున్నదని; జయమున్నదంటే అక్కడ సంకల్ప మున్నదని మనం అర్థం చేసుకోవాలి! సంకల్పం ఉంటే సంకల్పం సిద్ధిస్తుంది; వికల్పం ఉంటే వికల్పం సిద్ధిస్తుంది. వెరసి ఏది కల్పన మనం చేస్తామో...ఏది వికల్పం చేస్తామో, ఏది సంకల్పిస్తామో ...అది సిద్ధిస్తుంది! వికల్పానికి ప్రచండమైన శక్తి వుంటే...వికల్పం సిద్ధిస్తుంది. సంకల్పానికి ప్రచండమైన శక్తి వుంటే...సంకల్పం సిద్ధిస్తుంది.

## కొత్త ఒరవడి

ఒకప్పుడు శ్రీలంక లాస్ట్ టీమ్‌గా ఉండేది ప్రపంచంలో. అప్పుడు మేటి సనత్ జయసూర్య వచ్చి మొట్టమొదటి ఓవర్లోనే సిక్సర్లు కొట్టడం మొదలు పెట్టాడు. కొత్త ఒరవడి సృష్టించాడు. ఏదైనా సృష్టించగలం. అంతకు ముందు మనం వెధవలం కనుక ఇవాళ కూడా వెధవలం కానక్కర్లేదు. అంతకుముందు చిన్న వికల్ప శక్తి ఉంది కనుక మనం విఫలమయ్యాం. ఈ రోజు సంకల్పశక్తి అధ్యయనం చేసి సంతరించుకుంటే ఒక రోజు సఫలీకృతులమౌతాం! "నిన్నటి బట్టి ఇవాళ కాదు, ఇవాళ సంకల్ప శక్తి బట్టి ఇవాళ విజయం!" నిన్నటి సంకల్ప శక్తి, నేటి సంకల్ప శక్తి, అథవ నేటి వికల్ప శక్తి బట్టి నేటి సిద్ధి. నిన్నటికి, ఇవాళ్టికి సంబంధం లేదు. మొన్న ఇండియా ఓడిపోయింది. ఇవాళ కూడా ఆస్ట్రేలియాతో ఇండియా ఓడిపోతుందా ఏంటి?

## ధ్యాస మీద ధ్యాస

సంకల్పం పటిష్టం చేసుకుంటే, ఈ గంగూలీ టీమ్ అంతా రోజూ ధ్యానం చేస్తే ఇండియా నెం.1 అవుతుంది గ్యారెంటీగా. ధ్యానం చేసి చావరు! మన దగ్గరికి వస్తే కదా ధ్యానం నేర్పించడానికి!

మై డియర్ ఫ్రెండ్స్, శుద్ధి అన్నది శక్తిని ప్రసాదిస్తుంది. శక్తి ద్వారానే సిద్ధి. కనుక శ్వాస మీద ధ్యాస అన్నది ధ్యాస శాస్త్రం అయితే, ధ్యాస మీద ధ్యాస అన్నది సంకల్ప శాస్త్రం!

అహింస మీద ధ్యాస ఉంచాడు మహాత్మాగాంధీ. తోటి ప్రాణికి సేవ అన్న విషయం మీద ధ్యాస ఉంచింది మదర్‌థెరిస్సా. ఆ....సంగీతం మీద, స్వరముల మీద ధ్యాస ఉంచాడు బిస్మిల్లాఖాన్.

ఆత్మజ్ఞానులు, ధ్యాస అయినవారు. శాస్త్రజ్ఞులు ధ్యాస మీద ధ్యాస ఉంచుతారు. బిస్మిల్లాఖాన్ దగ్గర సుస్వరం ఉంటుంది. సోక్రటీస్ దగ్గర సుధ్యాస ఉంటుంది. ఓ ఆత్మజ్ఞాని దగ్గర సుధ్యాస వుంటుంది.

మై డియర్ ఫ్రెండ్స్! ధ్యాస శాస్త్రమే సృష్టి శాస్త్రం! ధ్యాస విజ్ఞానమే సృష్టి విజ్ఞానం! ధ్యాసే సృష్టి, స్థితి, లయలకు కారణభూతం! ధ్యాస ద్వారానే సృష్టి, ధ్యాస ద్వారానే స్థితి, ధ్యాసోపసంహారం ద్వారానే లయ. మన జీవితానికి మనమే సృష్టి కారకులం; స్థితి కారకులం; లయ కారకులం! మన ఆనంద విషాదాలకూ, ఆరోగ్య అనారోగ్యాలకూ మనమే సృష్టి కర్తలం! స్థితి కర్తలం! లయ కర్తలం! మన పుట్టుక మన చావులకు మనమే సృష్టి కర్తలం! స్థితి కర్తలం! లయ కర్తలం!

మై డియర్ ఫ్రెండ్స్, మై డియర్ మాస్టర్స్, మై డియర్ గాడ్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ – ధ్యాస శాస్త్రం, ఇంటెంట్ శాస్త్రం, థాట్ పవర్, మనో వైజ్ఞానిక శాస్త్రం అంటే ఇదే! ఆధ్యాత్మిక శాస్త్రం అన్నా ఇదే!

మనో వైజ్ఞానిక శాస్త్రానికి ధ్యానం ను జత పరిస్తే అది ఆధ్మాత్మిక శాస్త్రం అవుతుంది! ఆధ్మాత్మిక శాస్త్రం నుండి ధ్యాన శాస్త్రం అన్న దాన్ని పక్కన పెడితే, అది మనోవైజ్ఞానిక శాస్త్రం అవుతుంది మై డియర్ ఫ్రెండ్స్, మై డియర్ మాస్టర్స్, మై డియర్ గాడ్స్. మనం మౌలికంగా ఆధ్మాత్మిక శాస్త్రజ్ఞులం అందులోనే మనో వైజ్ఞానికత ఇమిడి వుంది. కేవలం మనో వైజ్ఞానికతలో ఆధ్యాత్మికత అన్నది ఇసుమంతైనా లేదు. కనుక పిరమిడ్ ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞులకూ, విశాల హృదయులైన పిరమిడ్ మాస్టర్లకూ వేరే మనోవైజ్ఞానిక శాస్త్రం లేదు. ఆత్మ శాస్త్రం, ధ్యాన శాస్త్రాలకు అనుబంధమైనదే మనోవైజ్ఞానిక శాస్త్రం. కనుక ఆధ్యాత్మిక శాస్త్రం ధ్యాన శాస్త్రం తెలియని వాళ్ళ కోసం ఈ రోజు ఈ యొక్క సంకల్పశక్తి, ఈ యొక్క ధ్యాస శాస్త్రం గురించి విశదీకరించవలసిన అవసరం ఏర్పడింది! పిరమిడ్ మాస్టర్లకు ఈ అవసరం లేనేలేదు.

# "ఓం తత్ సత్"

1. మనం "జీవితం" అనే ఆటలో వున్నాము! కానీ, మనకు అంతుబట్టని ఆటే జీవితం!
2. ఈ ఆటలో గెలుపు/ఓటములు వుండవు, అయితే సుఖ దుఃఖాలు వున్నాయి. సంతోష విషాదాలు వుంటాయి... ఈతి బాధలు వుంటాయి... మరి రకరకాల మిశ్రమ అనుభవాల పరంపర వుంటుంది.
3. ఆటలో ఆట...ఆటలో ఆట... ఇలా ఎన్నో పెద్ద పెద్ద ఆటల్లో చిన్న చిన్న ఆటలు.
4. జీవితాలు అన్నవి ఉమ్మడి ఆటలు ! పాత్రలు అనేకానేకం ! ఎవరి మన:తత్వాన్ని బట్టి వారు ఆటల్లో పాల్గొంటూ వుంటారు.
5. ఆటల్లో కాస్సేపు ఆగిపోవడం అన్నది కూడా ఆటలో భాగమే ! "కాస్సేపు ఆగిపోవడం" అంటే శరీరంలోంచి నిష్క్రమించడమే!
6. క్షణక్షణం మారే ఈ మహా ఉమ్మడి ఆటలో **"BALL"** ఎటు పోతుందో ఎవరికెరుక? పైనున్న పెరుమాళ్ళకు సైతం తెలియదుగాక తెలియదు!
7. పైన ఉన్న వాళ్ళకు కూడా తెలియదు కాబట్టి, వాళ్ళు కూడా ఎంతో ఉత్కంఠతతో ఈ భూలోకంలో జరిగే చిత్రవిచిత్ర ఆటలను వారి వారి స్వీయ "ఆత్మ" లలో చూస్తూ వుంటారు! మరి అప్పుడప్పుడూ వాళ్ళ వాళ్ళ సరదా "బెట్టింగులు" లో కూడా ఉంటుంటారు..!
8. ఒక గొప్ప ఏమిటంటే **EGYPTIAN HERMETIC PRINCIPLE** ఏమిటంటే **"AS BELOW, SO ABOVE"** ఒకానొక గొప్ప ఈజిప్షియన్ సత్య సిద్ధాంతం ఏమిటంటే **" క్రింద ఎలా వుంటుందో పైన కూడా అలానే ఉంటుంది".**
9. ఒక గదిలోంచి మనం ఇంకొక గదిలోకి వెళ్తే వారి మన:తత్వాలు మారవు; మరి మన ఆటలు కూడా మారవు! కోరికల బట్టే ఆటలు! రకరకాల కోరికలలోంచి రకరకాల ఆటలు పుడుతూ వుంటాయి!
10. క్రింది లోకం నుంచి పై లోకం లోకి వెళ్ళడం అన్నా..పై లోకాలకు రావడం అన్నా .. **"గదులు"** మారడమే! అయితే పై గదులలో.. అంటే పై లోకాలలో.. ఆకలి దప్పులు, ఈతి బాధలు వుండవు!
11. ఇదంతా లెక్కలేనంత మంది భగవంతుల అంతులేని గాధ! అంతులేని గోల!
12. దీనినే పురాణాలలో **"లీల"** అన్నారు.
13. సర్వజ్ఞులు **"లీల"** అనీ... అల్పజ్ఞులు **"మాయ"** అనీ... సృష్టితత్వాన్ని రెండు విధాలుగా వ్యాఖ్యానించారు. ఆత్మానుభవం వుండి ఆత్మతత్వం వైపు నుంచి

శరీరతత్వం వైపు చూస్తే, అప్పుడు అంతా "మాయ" అనిపిస్తుంది.

14. అర్థమయితే గాథ! అర్థం కాకపోతే గోల! అర్థం చేయిస్తే బోధ!
15. ధ్యానం ద్వారానే ఆత్మానుభవం; పిరమిడ్ మాస్టర్లు అంటే మహా ధ్యాన బోధకులు!
16. ధ్యానం ద్వారా "మాయ" అనే కాన్సెప్ట్ నుంచి బయటపడి "లీల" అనే కాన్సెప్ట్‌లోకి ప్రవేశిస్తాం.
17. ధ్యానానికి పూర్వం అంతా "గోల" – అంతా "మాయ" – అంతా "అల్పజ్ఞత్వం". ధ్యానానికి పూర్వం మణిపూరక అనాహత స్థితులు .. ధ్యానంలో విశుద్ధ, ఆజ్ఞా స్థితులు.. ధ్యానం తరువాత మరి సహస్రార స్థితి .. ధ్యానం తరువాత అన్నీ "డ్రామా"లు.. అంతా "లీల" అంతా "సర్వజ్ఞత్వం".
18. ధ్యాన అభ్యాసం లేకపోతే అంతా "ట్రాజెడీ"యే! ధ్యాన అభ్యాసం వుంటే అంతా "కామెడీ"యే!

**"ధ్యానం అంటే శ్వాస ధారలో మనస్సును నిమజ్జనం చేయడమే"**

**"ధ్యానం అంటే శ్వాస మీద ధ్యాస"**

**– బ్రహ్మర్షి పత్రీజీ**

# తటవర్తి వీరరాఘవరావు గారి రచనలు

1) జీవితశాస్త్రం (మొదటి భాగం)- రూ.100/-
2) జీవితశాస్త్రం (రెండవ భాగం)- రూ.100/-
3) జీవిత సత్యాలు - రూ.100/-
4) భగవంతుడంటే - రూ.100/-
5) సత్యమార్గం - రూ.100/-
6) ఆత్మ శాస్త్రం - రూ.100/-
7) ధ్యాన శాస్త్రం - రూ.100/-
8) జ్ఞానరసగుళికలు (పత్రీజీ) - రూ.100/-
9) పరమగురువుల ప్రబోధాలు (పత్రీజీ) - రూ.100/-
10) భగవద్గీతా సారం - శ్రీ కృష్ణ సందేశం - రూ.100/-
11) ధ్యాన శక్తి - రూ.100/-
12) తెలుసుకోండి - రూ.120/-
13) జీవిత సూక్ష్మాలు - రూ.120/-
14) గీతాసందేశం - రూ.100/-
15) కర్మ సిద్ధాంతం - రూ.60/-
16) బ్రహ్మాజ్ఞానం - రూ.60/-
17) ఆత్మజ్ఞానం ఎందుకు? - రూ.70/-
18) ధ్యానమంటే ? - రూ.50/-
19) జ్ఞాన జ్యోతి - రూ.70/-
20) జ్ఞాన కుసుమాలు - రూ.50/-
21) దుఃఖ నివారణామార్గం- రూ.60/-
22) త్రివిధాలు - రూ.60/-
23) ధ్యానం (పత్రీజీ) - రూ.50/-
24) ధ్యానం వల్లనే జ్ఞానం - రూ.60/-
25) అతీంద్రియ శక్తులు - రూ.50/-
26) శాస్త్రాల అర్థం- అంతరార్థం - రూ.50/-
27) ఆశ్చర్యం... ఆశ్చర్యం - రూ.50/-
28) విద్యార్థుల వికాసానికి ధ్యాన విద్య - రూ.50/-
29) మౌన ధ్యానం - రూ.40/-
30) ఈ జీవితం ఎందుకు? - రూ.50/-
31) నిర్వాణ మార్గం - రూ.50/-
32)షిరిడీసాయి సందేశాలు - రూ.40/-
33) భాగవత సన్నివేశాల అంతరార్థం - రూ.40/-
34) భూతదయే దైవత్వం - రూ.40/-
35) ఆలోచించండి - రూ.40/-
36) సంకల్పమంటే? - రూ.50/-
37) మరోజన్మ (తటవర్తి రాజ్యలక్ష్మి) - రూ.30/-
38)మనం ఇహలోకవాసులమా? పరలోకవాసులమా? - రూ.20/-
39) శాకాహారమే మానవాహారం - రూ.15/-
40) అహింస మరియు శాఖాహారం - రూ.15/-

పుస్తకముల కొరకు :
తటవర్తి వీర రాఘవరావు,
తటవర్తివారి వీధి, భీమవరం-1. ప॥గో॥జిల్లా.
సెల్ : 9440309812, 9490171853



"ఈ యొక్క అంశం ...
సంకల్ప శక్తి... అన్నది జీవితంలో
అత్యంత మౌలికమైన విషయం.
మనిషి తన 'సంకల్ప శక్తి'తోనే
'సృష్టికర్త'గా విరాజిల్లి ఉన్నవాడు.
మనిషే కాదు ఏ ప్రాణి అయినా
సరే తన 'సంకల్పశక్తి' తోనే
'కర్త'గా, 'సృష్టికర్త'గా
విరాజిల్లి ఉంది. "

– బ్రహ్మర్షి పత్రీజీ

రూ. 50/-